## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035304



**SaiRealAttitudeManagement**(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయ సూచిక

నాగశేషాంబాయనమ

ఓం

## విఘ్నేశ్వర ధ్యానము

శ్లో॥ శుక్లాం బరధరం విష్ణుం । శశివర్ణం చతుర్భజమ్ ।
ప్రసన్న వదనం ధ్యాయే । త్సర్వవిఘ్నోప శాంతయే ॥
అగజానన పద్మార్కం గజానన మహర్నిశం
అనేక దంత భక్తానా । మేకదంతముపాస్మహె



## శ్రీ కృష్ణప్రార్థన

1 శ్లో ॥ వంశీ విభూషిత కరాన్న వనీరదాభాత్ ।
పీతాంబరా దరుణ బంబ ఫలాధరోష్ఠాత్
పూర్ణేందు సుందర ముఖాదర విందనేత్రాత్ ।
కృష్ణార్పణం కిమపి తత్వమహాంనజానే॥

తా ॥ మురళిచే అలంకరింపబడిన హస్తము, నీల మేఘ శరీరము, పచ్చని పట్టు వస్త్రము ఎర్రని దొండపండువంటి అధరము, పూర్ణిమ చంద్రుని వంటి సుందర ముఖము పద్మమువంటి నేత్రములుగల శ్రీకృష్ణ పరబ్రహ్మ కంటే మరియొక గొప్ప తత్వము నాకు తెలియదు.

2 శ్లో ॥ సచ్చిదానందరూపాయు, విశ్వజన్మాదిహేతవే
తాపత్రయ వినాశాయ శ్రీకృష్ణాయనమోనమ॥

తా॥ సచ్చిదానందరూపుడును, జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు కారణభూతుడును, ఆధి దైవిక, ఆధ్యాత్మిక, ఆధి భౌతికములగు తాపత్రయములను నాశనము చేయువాడును, అయిన శ్రీకృష్ణ పరమాత్మకు నమస్కారము

3. శ్లో॥ వాసుదేవాయ కృష్ణాయ జగన్మంగళకారిణే ।
విశ్వస్వరూపదేహాయ శ్రీకృష్ణాయనమోనమ ॥

తా॥ ప్రపంచమందలి సర్వవస్తువులను ప్రకాశింపచేయువాడును, భక్తుల పాపములను, హరించువాడును, జగత్తునకు మాంగళ్యము కలిగించు వాడును, విశ్వము తన రూపముగ అయిన శ్రీకృష్ణపరమాత్మకు నమస్కారము.

4. శ్లో॥ కృష్ణాయ యాదవేంద్రయ మేఘశ్యామల మూర్తయే ।
ప్రణతక్లేశ నాశాయ శ్రీకృష్ణాయ నమోనమః ॥

తా॥ కృష్ణవర్ణుడును యదువంశ శ్రేష్ఠుడును మేఘశ్యామలము వంటి కాంతిగలవాడును, నమస్కరించువారి కష్టములను పోగొట్టునట్టి శ్రీకృష్ణపరమాత్మునకు నమస్కారము.

5 శ్లో॥ వసుదేవ సుతందేవం । కంస చాణూర మర్దనం
దేవకీ పరమానందం । కృష్ణం వందే జగద్గురుం

తా॥ వసుదేవుని కుమారుడును, కంస, చాణూరులను మర్దించినవాడును, దేవకీదేవికి గొప్ప ఆనందమును కలిగించినవాడును, జగత్తునకు గురువైన శ్రీకృష్ణునికి నమస్కరించుచున్నాను

> దేహాన్ని, ఆత్మగా, భ్రమించడమే 'మాయ' సంసార సృష్టికి ఈ మాయయే కారణం.
>
> శ్రీరాముడు

## శ్రీవిరాట్ పోతులూరివీరబ్రహ్మేంద్రాయనమః

### అమ్మ తల్లియైన శ్రీమతి యద్దనపూడి భద్రమ్మగారు చెప్పిన పద్యములు

1 మూడు లోకాలు - నీ బొజ్జలో నిండుకున్న
ముద్దు బాల - వేగరావయ్యా
మీతోటి బాలుర చెలిమి సలుపవయ్యా
మీచెలిమి - నాకు కలిమి

నీ శక్తి నాకు భక్తి - నీ సేవనాకు త్రోవ
నిఖిలమే లే దేవా ।
వేదాలసారంబు యియ్యవా కృష్ణా ।
విద్య లన్నియు మాకు యియ్యవా కృష్ణా ।

2 పాల సముద్రము పరచి - పాన్పువేయగలేను
పాల సముద్రము తరచి - పణితినీయగలేను
పెన్నిధులు నాకు లేవు కృష్ణా ।
బేలమనసు అందుకోవయ్యా కృష్ణా ।

3. ఉన్న దాననుగాను - ఉనికిజగమెల్ల
కన్న దాననుగాను - కలనైన
యల్లవారు నావారే
యందులకు మీకు యీ శ్రమ, నేను చూచుదాన

విశ్వ కర్మ పరబ్రహ్మణేయనమ
విశ్వకర్మ జగన్నాథం - విశ్వకర్మ జగద్గురు
విశ్వకర్మ జగత్తేజం విశ్వకర్మమయం జగత్ ॥

## మనవి

## ఎందరో మహానుభావులు అందరికి వందనములు :

దివ్యతపస్విని, శ్రీ యద్దనపూడి నాగశేషమ్మగారి పాదపద్మములకు నమస్కారములు. అమ్మ భారతదేశములో జన్మించటం నిజముగా భారతీయులకే గర్వకారణం. అమ్మ వయస్సు 47 సం॥లు నర్సరావుపేట గవర్నమెంటు ఆస్పత్రిలో ఆశ్వయుజ మాసం బహుళ అష్టమినాడు పుట్టినారు. నేను సత్తెనపల్లిలో డిప్యూటి తాహశీల్‌దార్‌గా పనిచేయుచున్న సమయంలో, తెనాలి వాస్తవ్యులు కీ॥ శే॥ కాళాప్రపూర్ణ డా॥ కొండూరు వీర రాఘవాచార్యులుగారు జీవన్ ముక్తురాలైన అమ్మను గూర్చి ఆంధ్రప్రభలో ప్రచురించిన వ్యాసమును చదివి అమ్మను గూర్చి తెలుసుకుంటిని. దివ్యతపస్విని లోకకళ్యాణార్థం "అమ్మ అత్యున్నత సమాధి నిష్ఠలో యున్నారని తెలుసు కొంటిని. సమాధి అనగా జీవుడు పరబ్రహ్మలో లయమగుట అమ్మ జ్ఞాని పూర్వజన్మ సుకృతం వల్ల పుట్టుకతోనే ఈ ప్రపంచాన్ని ఈశ్వర తత్వంగా చూస్తుంది. యిది ప్రపంచం అనేభావన వదలివేసింది. ఈ ప్రపంచంఅంతా సచ్చితానందంగా చూస్తుంది. భక్తులకు, ఆరోగ్యము సంతానము, యిచ్చుచున్నదనియు, భక్తుల పాలిటి కల్పవృక్షమనియు, తెలుసుకొంటిమి. అనారోగ్యముతో బాధపడుతున్న నా భార్య శ్రీమతి సరోజిని ఆరోగ్యము కొరకు రాజుపాలెం వెళ్ళి, అమ్మకు పూజలు చేసినాము. పది రోజులలో నాశ్రీమతికి, అమ్మ ఆరోగ్యము యిచ్చినారు అమ్మ ఎంతో శక్తివంతమైన తల్లియని అపుడు గ్రహించి, అప్పటి నుండి అమ్మ భక్తుడనైతిని. పదిసంవత్సరముల క్రిందట అమ్మవారు, నా శ్రీమతికి కలలో కనపడి పాదుకలు, కావలెనని ఆజ్ఞయిచ్చినారు. మేము పాదుకలు చేయించుకొని రాజుపాలెం అమ్మ సన్నిధిలో ఉంచినాము అమ్మ వాటిని స్వీకరించలేదు. మరునాడే ఆపాదుకలు తెల్లవారు ఝామున 4.00 గంటలకు రాజుపాలెం నుండి సత్తెనపల్లిలో మేము నివసించుచున్న యింటి ముందుకు వచ్చినవి. ఎంత ఆశ్చర్యముమా శ్రీమతి

అమ్మ ధ్యానంలో ఉన్నపుడు, పాదుకలకు శాంతి చేయవలెననియు, 41 రోజులు లలితా సహస్రనామము చేయమనియు ప్రతిరోజు ఇద్దరు బ్రాహ్మణులకు భోజనము పెట్టి సత్కరించవలెననియు ఊరేగింపు తోటి పాదుకలను సత్తెనపల్లి నుండి రాజుపాలెం మరల తీసుకొనివచ్చి అమ్మ సన్నిధిలో వుంచమని ఆజ్ఞ యిచ్చినారు అమ్మ ఆజ్ఞ ప్రకారం ఊరేగింపుతో "జయహోమాత నాగశేషమాంబ రాజరాజేశ్వరి శ్రీ ప్రరాత్పరి" అను అమ్మ నామం తోటి పాదుకలను, త్రిశూలమును, సత్తెనపల్లి నుండి రాజుపాలెం తీసుకొని వచ్చి అమ్మ సన్నిధిలో వుంచినాము అపుడు అమ్మవారు పాదుకలను స్వీకరించినారు పాదుకలు, యిప్పటికి, అమ్మ సన్నిధిలోనున్నవి. చివరకు అమ్మ ముఖ్య భక్తురాలైన నా శ్రీమతి సరోజిని, అమ్మను స్మరించుచు ది 10586 తేదీన గుంటూరులో ప్రైవేటు నర్సింగు హోమ్‌లో లింగైక్యమైనది ఆమె ఆత్మకు శాంతి కలుగుగాక!

అనేక మంది భక్తులు అమ్మకు గుంటూరులోను, సత్తెనపల్లిలోను గుడి కట్టించెదమని ముందుకు రాగా, అమ్మ అందుకు అంగీకరించలేదు. చివరకు అమ్మ స్వగృహంలో ధ్యానమందిరమును నిర్మింపుమని తల్లిగారైన శ్రీమతి యద్దనపూడి భద్రమ్మ గారితో చెప్పగా ది 4-4-92 తెలుగు సంవత్సరాది పండుగ రోజున భక్తులు నిర్మించిన పవిత్రమైన ధ్యానమందిరములోనికి అమ్మవారు ప్రవేశించి లక్షలాది భక్తులకు దర్శన మిచ్చిరి. ప్రతి సంవత్సరము 1980 నుండి ప్రతి మాఘ పౌర్ణమి రోజున అమ్మకు భక్తులు ఉత్సవములు చేయుదురు. ఆరోజున భక్తులకు అన్న దానము భజనలు సాంస్కృతిక కార్యక్రమములు నేటికి నిర్వర్తించుచున్నారు నా గురుదేవుడు అమ్మగారి తండ్రి అయిన శ్రీ యద్దనపూడి కోటయ్య గారు ది 11-6-95 న బ్రహ్మైక్య మందిరి వారి ఆత్మకు శాంతి కలుగుగాక!

15 సంవత్సరాలనుండి అమ్మ సేవలో నాతో సహకరించుచున్న సత్తెనపల్లి వాస్తవ్యులు శ్రీ తుమ్మల వేంకటేశ్వరరావుగారు (టింబర్ మర్చంట్) కిలార్‌నెట్ విద్వాంసులు డి రామకోటి, (సత్తెనపల్లి) గారికి శ్రీ యస్ భద్రాచలంగారికి, వారిగురువుగారైన పూండ్ల వీరబ్రహ్మా చార్యులు (రేటూరు) గారికే, నందిరాజు పాలెం వాస్తవ్యులు, కల్లూరి సుబ్బారావుగారికి అమ్మ భక్తులకు

నా హృదయ పూర్వక నమస్కారములు. ముద్రణలో సహకరించిన శ్రీరావ్వారి విజయకుమార్ గార్కి అమ్మ ఆశీస్సులు ఈ పుస్తకము నా కుటుంబ సభ్యుల సహకారముతో అచ్చువేయడమైనది ఈ పుస్తక ప్రచురణకు సహాయపడిన వారందరూ, అమ్మయొక్క దివ్యాశిస్సులతో బ్రహ్మానందమును పొందెదరు.

"సర్వేజన సుఖినోభవంతు"

ఇట్లు
పి బానుప్రసాదరావు
రిటైర్డు తహశీల్దారు
(అమ్మ భక్తుడు)

## శ్రీ పరమేశ్వరీ స్వరూపిని నాగశేషమాంబగారు గుంటూరులో భక్తులు అడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పట :

1 ప్రశ్న : అమ్మా! భగవంతుడు ఏ రూపమున దాల్చి ఉన్నాడు ?

జవాబు : అ శిల్పి మలచిన ఆభరణములు అనేక విధములైనప్పటికి సువర్ణము ఒక్కటే కదా! అట్లే పలు ప్రాంతములందు పలు రూపములందు పలు పలు రూపములుగా భగవంతుడు కనిపించినప్పటికి ఆత్మ స్వరూపమై వెలుగు పరమాత్మ స్వరూప మొక్కటే.

2. ప్రశ్న . భగవంతుడు ఎక్కడ ఉన్నాడు?

జవాబు . ఇందుగలడందు లేడని సందేహము ఏల? చక్రి సర్వోపగతుండు అని అన్నట్లుగా ఆ పరమాత్మ అణురూపమున సర్వాంతర్యామియై సమస్థ చరాచరములందున్నాడు.

3 ప్రశ్న · భగవంతుని సేవించుటకు ఈ స్నాన సంధ్యానుష్టానము అవసరమా?

జవాబు : ఈ స్నానము మడి మయిల అనునవి వలప శుచి, శుభ్రతల కొరకు ఏర్పడినవి ఆచారము లేకున్న రోగ భూయిష్టమై దేహము కృషించును. దేహము లేకున్న దైవమెక్కడిది? అందు కొరకే గాని భగవంతుని ప్రార్ధించుటకు, ఈ బాహ్య క్రియలు ఏమి అడ్డురావు ఇక సంధ్యానానుష్టానము, యనునవి - క్రమశిక్షణ కొరకు నిర్ణయించబడినవి ఇక జీవబ్రహ్మక సంధాన శిఖరము నెక్కగోరువారిని తొలిమెట్టు రూప, నామ క్రియారహితుడైన ఆ పరంజ్యోతి స్వరూపమునకు మడి ఎక్కడ మైల ఎక్కడ

4 ప్రశ్న భగవంతుని సేవించుటకు విగ్రహారాధన గాక వేరు మార్గము లేమైన కలవా?

జవాబు సత్యమే భగవంతుడు, పరోపకారమే భగవంతుడు, నిస్వార్ధ సేవయే భగవంతుడు, నిరంతర కృషియే భగవంతుడు, కఠోర క్రమశిక్షణయే భగవంతుడు, ఇట్లనేక కార్యరూపములలో భగవంతుడు కనిపిస్తాడు కాని పలకలేకుండా మనము ఓ-న-మాలు దిద్దగలమా? అట్లాగే అక్కడేదో రూపములో ఏదో శక్తి ఉన్నదనుకొన్నపుడే మనకు గురి కుదిరి మనసు లగ్నమగుటకు అవకాశమున్నది. అందుకే విగ్రహారాధన, భగవంతుని సేవించుటెట్లు? చేరుటెట్లు ? అని మీరు అడిగే ప్రశ్నలకు ఎవరూ జవాబు చెప్పజాలరు ఎందుకంటే జవాబు లేదుగనుక. ద్వేషముతో హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు భగవంతుని చేరుకున్నారు. అమాయకంతో నమ్మిన ప్రహ్లద కుమారునికి తానే స్వయముగా దర్శనమించాడు. మూఢ భక్తితో బోయతిన్నడు, తన గాన మాధుర్యముతో భక్త మీరాభాయి, భక్తి ప్రపత్తులతో సక్కుభాయి పరమాత్మని కనుగొన్నారని మన గ్రంధములు చెప్పుచున్నవి అట్లు అనేక మార్గములుండగా ఏ మార్గమని ఎవరు శాశించగలరు? కనుక ఆత్మ విశ్వాసముతో

ఒక నిర్ణీత మార్గాన క్రమకోర్చి సాధనమున భగవంతుని అన్వేషించవలనే గాని కనిపించిన వారందరిని దేవుడేక్కడ? దేవుడేక్కడా? అని అడిగిన ఎవరు చెప్పలేరు చూప జాలరు

అని యింక అనేక విషయములు విశదపరిచి సమాధి నిష్టకు వేళయగుటచే, భగవదనుగ్రహముచే మనమధ్య ఈ ప్రసంగము ఇంతసేపు నడచెను ఇందలి అంశములు మీకు మేలు కలుగుగాక యని మమ్ములను ఆశీర్వదించి లోనికేగిరి

## పీఠిక

నే నొకసారి గుంటూరులో ఆధ్యాత్మికోపన్యాసము చేస్తున్న సందర్భములో 'గాయత్రీ మంత్రోపాసన' మహిమను గూర్చి విపులమైన ప్రవచనము కొనసాగింది ఆ ఉపన్యాసము వింటున్న సభ్యులలో మా బంధుమిత్రులు శ్రీ శే పోతేపల్లి కృష్ణమూర్తి గారు కూడా ఉన్నారు నా ఉపన్యాసము విన్నాక ఆయనకు తాను గాయత్రీ మంత్రోపాసన చేసి సత్ఫలితాలను పొందాలనే సంకల్పము కలిగింది. ఉపన్యాసానంతరము నన్ను తమ ఇంటికి తీసుకొని పోయి మంత్రజపమును గూర్చిన కొన్ని పరమ రహస్యాలను చెప్పించుకొన్నారు ఆయన ఉపనయనమునాడు గాయత్రీ మంత్రోపదేశము పొందినప్పటకీ మరల నావద్ద భక్తితో ఉపదేశము పొంది రోజూ అష్టోత్తరశతము చొప్పన నియమబద్ధముగా జపము కొనసాగించారు క్రమముగా ఉపాంశు, మానసిక జపాల పద్ధతులు కూడా నేర్చుకొని ఒక్క సంవత్సరములోనే ప్రతిదినము సహస్ర గాయత్రిని నిశ్చలముగా జపించటము అలవరచుకొన్నారు.

ఈ గాయత్రీమంత్రోపాసనలవల్ల ఆయన మనస్సు ఎంతో నిర్మలమైనది కుటుంబ సంబంధముగా ఏవేవో శుభాలు జరగడం, పూర్వము కంటే నిత్యజీవితంలోనూ, కుటుంబవిషయాలలోనూ, అభివృద్ధి కానరావడం పొసగినది కొన్ని దివ్య శక్తులనుకూడా ఆయన పొంది మహావ్యక్తిగా రూపొందారు. ఆ సమయములోనే "రాజుపాలెం బాలయోగిని"గారు గుంటూరులో తన యోగసాధనను కొనసాగిస్తూ ఉండేది శ్రీ కృష్ణమూర్తిగారే నాకు ఆమెను గూర్చి ఆరోజులలోనే పరిచయము చేసారు 4,5 సార్లు

నాకు ఆమెను గూర్చి ఆరోజులలోనే పరిచయము చేసారు 4,5 సార్లు ఆమె నివాసమున్న ఇంటికి పోయి దర్శన సంభాషణాదులు జరపటానికి ప్రయత్నించానుగాని, నేను వెళ్ళినప్పుడల్లా ఆ తల్లి సమాధిలోనే ఉంటున్నందు వల్ల వీలుకాలేదు అయినా ఆ ఇంటిలో ఉండేవారివల్ల అమ్మ చర్యలు, మాటలు, నడవడి, తెలిసికొని తృప్తిపడేవాణ్ణి ఆమె ఉన్న ప్రదేశంలోనూ, పరిసరాలలోనూ, అప్పటికే అద్భుతశక్తులు కనబడుతూ ఉండేవట. ఆమె సమాధిలో ఉన్నప్పుడు ఆ ప్రదేశంలో వెలుగు వ్యాపించటం, కొంతసేపు ప్రణవ నాదము వినపడటము, ఇత్యాదులైన అద్భుతాలు జరిగేవట! ఇలాంటి దివ్యశక్తులతో ఆమె గుంటూరు పౌరులను అప్పడే బాగా ఆకర్షించ గలిగింది శ్రీ కృష్ణమూర్తిగారు దేవీభక్తుడు కూడా కనుక, ఆ యా విశేషాలను ఎప్పటికప్పడు, లేఖల ద్వారా వ్రాస్తూ ఉండేవారు.

ఆనాటి నుండే, అమ్మ అద్భుతయోగాన్ని గూర్చి, అధ్యయనం చేయాలని నాకు సంకల్పము కలిగినది. పిమ్మట అమ్మను రాజుపాలెం తీసికొని పోవటం, మేము రాజుపాలెం వెళ్ళి అమ్మ విశేషాలను ఆకర్షించు కోవడం, ఇత్యాదులు జరిగినాయి. ఇలాంటి పూర్వరంగముతో అమ్మ చరిత్ర రచనకు పూనుకొనడమైనది.

శ్రీ కృష్ణమూర్తిగారు అమ్మమీదకూడా భక్తిగౌరవాలు పెంచుకొని తన మంత్రోపాసనను, దినదినాభివృద్ధి చేసుకుంటూ ఉండేవారు. ఆయన దాదాపు 80 ఏండ్ల వయస్సుకు చేరుకునే సమయంలో, కూర్చిండి, సహస్రగాయత్రిని చేసే ఓపిక లేకపోయినది ఆ సమయంలో తన శరీరాశక్రతను నాకు తెలుపగా పండుకొని అయినా, మానసికంగా గాయత్రీ ఉపాసనను కొనసాగించ వచ్చునని సూచించాను. అప్పటినుండి వారు అలాగే మానసిక జపముచేస్తూ, తనమనస్సు రజస్తమస్సులనుండి విడివడి, సత్వగుణభరితము కాగా, తన స్థూల శరీరాన్ని వదలిపెట్టి గాయత్రీ మహాదేవిలో ఐక్యమైనారు ఆయన ముక్తి పొందినాడా? లేక ఉత్తమ జన్మకు చేరుకున్నాడా? అని పాఠకులకు శంక కలుగవచ్చు. అది తెలిపే విషమయుగాని, ఊహకు అందే విషయము గాని కాదు కదా! జగన్మాతయొక్క అనుగ్రహానికి పాత్రుడైనవాడు గనుక, ముక్తిపొందినా, పొంది ఉండవచ్చు. ఎందుకంటే శ్రీ కృష్ణమూర్తిగారికి దైవశక్తులమీద, గురువులమీద, సత్యశోధకులమీద భక్తి గౌరవాలు మెండు ఆయన పరిశుద్ధుడైన ఆస్తికుడు ఆయనది మూఢభక్తి.

కనుక ముక్తి పొందినా పొందవచ్చు కృష్ణమూర్తిగారి ప్రశంస ఈ పీఠికలో ఎందుకు చేసానంటే భక్తివిశ్వాసాలు కలవారకి, ఏదైనా అసాధ్యము కాదనటానికే అంతేగాక అమ్మనుగూర్చి, అధికశ్రద్ధతో నే నామెను, అర్థముచేసుకోగలననే విశ్వాసముతో పరిచయము చేసినది కూడా ఆయనే కదా! అలాగే అమ్మను గూర్చి కూడా భక్తి గౌరవాలున్నవారు తప్పకుండా ఆ యా సిద్ధులను పొందగలుగుతారు జిల్లెళ్లమూడి అమ్మను నమ్మిన భక్తులు ఎన్నో ప్రయోజనాలు పొంది ఐహిక, పారమార్థిక, ఫలాలను పొందటం, నిన్నగాక మొన్న మనము చూచిన సంగతే కదా !

అమ్మనుగూర్చి, సంగ్రహముగా ఆంధ్రప్రభలో, ఒక వ్యాసమువ్రాసి ప్రకటించటమైనది తరువాత శ్రీ కోసూరి వెంకట సుబ్బారావుగారూ నేనూ, రాజుపాలెం వెళ్లినప్పుడల్లా అమ్మను గూర్చిన విశేషాలను తెలుసుకొనటమైనది. బహుకాలమునుండి, అమ్మను గూర్చి చేసిన మననమువల్ల, ఈ పుస్తకాన్ని ఈ పాటిగా వ్రాసే అవకాశము నాకు కలిగిది. ఈ చరిత్ర అంతా నేను చెబుతూ ఉండగా శ్రీ కోసూరి వెంకట సుబ్బారావుగారు వ్రాసారు

ఇట్లు

కొండూరు వీరరాఘవాచార్యులు (ప్రత్నానంద)

## పరిచయ వాక్యములు

పుణ్యభూమి అయిన భారతదేశంలో అనాదికాలంనుంచీ నేటివరకు మహానుభావులు అవతరించి లోకోద్ధరణ చేస్తూనే ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో కూడా నాటికీ, నేటికీ అలాంటి మహాయోగీశ్వరులకు కొఱవ లేకుండానే వున్నది బ్రహ్మంగారు, వేమన, రాఘవేంద్రస్వామి, గుంటూరులోని మస్తాన్‌సాహెబ్, బందరు దొంతులమ్మ మొదలయినవారిని గూర్చి మనం వినేవున్నాము. ముమ్మడివరం బాలయోగి సంగతి అందరూ కన్నదీ, విన్నదీ, కదా! ఆ కోవకు చెందిన మహాయోగీశ్వరియే రాజుపాలెం బాలయోగిని కూడా! వీరంతా పూర్వజన్మలోనే యోగాన్ని పండించుకొని, ఏదోకర్మశేషం వల్ల ఇలా అవతరించి వుంటారనుకోవటం సమంజసంగా ఉంటుంది

2) గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో 'రాజుపాలెం' అనే గ్రామం

ఉన్నది గుంటూరు నుండి 'మాచర్ల' పోయే బస్సులు ఎక్కితే సత్తెనపల్లి తర్వాత రోడ్డు ప్రక్కన 'రాజుపాలెం' తగులుతుంది ఆ గ్రామంలో యద్దనపూడి కోటయ్యగారనే బీద విశ్వబ్రాహ్మణుడున్నాడు ఆయన భార్య భద్రమ్మగారు - వీరిది యజుర్వేద ప్రసిద్ధుడైన అహభూన బ్రహ్మఋషిగోత్రం శ్రీకోటయ్యగారు బంగారు పని చేసికొని జీవించే స్వర్ణశిల్పి ఈ పుణ్యదంపతుల నోముల ఫలమే మన బాలయోగిని కుమారి నాగశేషమాంబ. ఈ దంపతులు ధార్మికచింతనగలవారు శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి భక్తులు వీరొకసారి తీర్థయాత్రలోని గుత్తికొండ బిలానికి వెళ్లినారు బిలంలో చాలా దూరమునడిచి, లోపలవున్న చీకటి మల్లయ్యను కూడ దాటిపోతూవుండగా, ఒక పెద్ద వెలుగు వారికి గోచరమై అంతలోనే మాయమైపోయిందట. ఇక అక్కడనుండి ముందుకుపోలేక వెనుదిరిగి వచ్చేశారు అలా వచ్చిన తరువాత కొద్ది రోజులకే శ్రీమతి భద్రమ్మగారు గర్భవతి అయినది అంటే స్వామితేజమే గర్భంలో ప్రవేశించిందని వేరుగా చెప్పకోనవసరంలేదు. తమ కూతురు ఒక మహాయోగిని అయిన తరువాత ఆ దంపతులు ఈ సంఘటన ఇందుకోసం జరిగిందని ఉహించుకోగలిగారు శిశువు, తల్లి గర్భములో పదునాలుగునెలలు వుండి, పదిహేనవ మాసమున గాని పుట్టలేదు శిశుజననం నర్సరావుపేట ఆస్పత్రిలో బిడ్డ పుట్టగానే దాది బొడ్డు కోయడానికి ప్రయత్నించి విఫలురాలైనది అంటే బొడ్డు కోయవలసిన అవసరమే కనబడలేదట గర్భంలోనే నాభినాళం నుండి విడిపడి పుట్టింది మహామహిమురాలు ఇందుకు అక్కడవున్న డాక్టర్లు ఎంతో ఆశ్చర్యపడ్డారు కూడా కోటయ్య, భద్రమ్మ దంపతులు అదివరకే శ్రీ అనుమలకొండ శివరామ దీక్షితులుగారి మనుమడు శ్రీ శేషమునీంద్రస్వాములవారి వద్ద గురూపదేశం పొందివున్నందున, గురుభక్తిమూలకంగా పుట్టిన ఈ బిడ్డకు నాగశేషమ్మ అని నామకరణం చేసుకొన్నారు.

3) అక్షరాభ్యాసం చేసి బడికి పంపిన తరువాత ఈ అమ్మాయి పంతులు చెప్పింది చదివేదికాదు. పంతులుగారి మొగమయినా చూడకుండా ఆటపాటలకు, తోడి పిల్లలను కూడా కలుసుకోకుండా దూరంగావున్న ఒక చెట్టు క్రింద పద్మాసనం వేసుకొని కూర్చుండి, శూన్యంలోకి ఏకాగ్రదృష్టితో చూస్తూ వుండేది. అయినప్పటికీ తల్లి శిక్షణలోనే చదువ, వ్రాయ నేర్చుకొన్నది.

అలనాటి 'మీరాబాయి' లాగ, కృష్ణ విగ్రహంతో ఆటలాడుతూ, పాటలుపాడు కొంటూ, దానికి పూజా పురస్కారాలు జరుపుతూ ఉండేది ఈ అమ్మయి భక్తిమార్గ ప్రవేశానికి, గ్రామస్థులు ఆశ్చర్యపడి, ఈమెను ప్రేమాదరాలతో చూస్తూ ఉండేవారు ఏడవ యేట, తనక్లాసుకు మగవాడు పంతులుగా వచ్చినాడని బడికి ఎగనామంపెట్టింది తల్లి కోపపడగా, దాపునేవున్న చిట్టడవికిపోయి ఒకచెట్టుక్రింద పద్మాసనం వేసుకొని కూర్చుండి తపస్సు ప్రారంభించింది. తండ్రి కోటయ్యగారు వెతుకుంటూపోయి నచ్చచెప్పి, లాలించి ఇంటికి తీసుకొనివచ్చారు నాటినుండి ఒంటిపూజ భోజనం రాత్రిపూట తల్లి అన్నం పెట్టితే అన్నాన్ని క్రిమికీటకాదులకు వెదచల్లుతూ వుండేది గాని, తానుతినేది గాదు. ఇది అంతా తల్లి దండ్రులకూ, గ్రామస్థులకూ వింతగావుండేది.

4) పన్నెండో యేట ఈ అమ్మాయి రజస్వల అయినది తదాది ఉదయ వేళ భోజనం కూడా మానివేసింది ఇష్టమయితే ఎప్పడన్నా ఇన్ని పాలు త్రాగడం, లేకపోతే అదీ లేదు ఇలాంటి స్థితిలోఉన్న కూతుర్ని ఏమీ అనలేక, నచ్చచెప్పి అన్నంతినిపించలేక తల్లిదండ్రులు బాధపడుతూవుండేవారు ఇలా రెండు మూడేళ్లు గడిచేటప్పటికి ఆ మొత్తం జుట్టంతా తెల్లగా నెరసిపోయింది ఒక రోజు పిచ్చుకలకు నూకలు చల్లుతూ, "మీకు గూళ్లు కావాలా? అయితే నా జుట్టు తీసుకుపోండి" అని చెప్పి మళ్ళీ ధ్యాన సమాధిలో కూర్చునేది. ఆమె సమాధిలో వున్నప్పడు పిచ్చుకలు ఆమె ఆజ్ఞ ప్రకారమే ఆ తెల్ల వెంట్రుకలను తీసుకొనిపోయి గూళ్లు కట్టుకొని వాటిలో గ్రుడ్లు పెట్టుకోనేవి. తరువాత కొంతకాలానికి మామూలుగా నల్లని జుట్టు పెరిగి జడలు కట్టుకొనిపోయినవి

5) ఇట్లు కొంతకాలం జరుగుతూ ఉండగా, శ్రీ కోటయ్యగారు స్వగ్రామంలో జీవనోపాధి జరగక, బ్రతుకు తెరువు కోసం గుంటూరు చేరవలసి వచ్చినది అరండల్‌పేటలో కొన్నాళ్లున్నారు ఆమె యోగనిష్ఠకు ఆశ్చర్యపడి భక్తులు కొందరువచ్చి "పాలు పండ్లయిన తీసుకో తల్లి" అని ప్రార్థించేవారు కాని ఆ తల్లికి ఆనాటికే ఆహారంతో అవసరం తీరిపోయింది యోగాభ్యాసంలో దొరికే అమృతసేవనం ఆమె ఆకలి దప్పలను జయించిన మహాయోగినిగా మారి పోయింది. పిమ్మటకోటయ్యగారు గుంటూరు అగ్రహారంలో యున్నపులవర్తికేశవయ్యగారి విశ్వబ్రాహ్మణ ధర్మసత్రానికి కాపురం

మార్చుకొన్నారు ఆ సమయంలో నాగశేషమ్మగారు తెల్లవారు జామునసే స్నానముచేసి, ధ్యానసమాధి నిమగ్నురాలై అర్ధరాత్రి వేళకు గాని లేచేదికాదు ప్రతిశుక్రవారం సత్యనారాయణ వ్రతములను చేస్తుండేది అందుకు కావలసిన టెంకాయ, కర్పూరం, సాంబ్రాణి బత్తీలు, మొదలైన పూజా సామాగ్రికి కూడ తండ్రిగారు డబ్బు ఇచ్చేస్థితిలోలేరు ఆయన బీదరికం అలా ఉన్నది అయినా ఆ యోగిని, స్వామిసన్నిధానంలో వుండే ఒక పుస్తకంలో నుండి వింతగా డబ్బుతీసుకొని పూజాద్రవ్యములు తెప్పించుకొనేది మరి ఆ డబ్బు ఎక్కడ నుంచి ఎలా వచ్చేదో ఎవ్వరికీ తెలియదు. ఎందరెందరో ఎన్నోవిధాల పరీక్షలు చేశారు. కాని ఏమీ అందు చిక్కలేదు చివరకు ఆమె అద్భుతశక్తులు గల ఒక మహోత్మురాలని నిశ్చయించుకొన్నారు ప్రజలు. నాటి నుండి ఈ బాలయోగినిని, చూడడానికి ఎందరెందరో వస్తూ ఉండేవారు. పండ్లు కానుకలు సమర్పిస్తూ ఉండేవారు ఆమె వాటిని ఎంత మాత్రము స్వీకరించేదికాదు ఆమె సమాధిలో ఉన్నప్పుడు తలిదండ్రులు వాటిని ఉపయోగించుకొనేవారు

6) కోటయ్య గారికి ఆ సత్రం కూడా అనుకూలంగా వుండనందు వల్ల, శివాలయం వద్ద యున్న వైశ్యుల ధర్మ సత్రంలో ప్రవేశించారు. ఆ సత్రంలో ప్రవేశించబోయే ముందు శ్రీ పులివర్తి వెంకటసుబ్బారావుగారు అమ్మను తమ సత్రంలోనే వుండమని ప్రార్థించారు. అందుకామె కొంతకాలానికి, నేను జీవసమాధి కాదలచాను మరి అందుకుతగినట్లు మఠం, వగైరా కట్టించి తగిన ఏర్పాట్లు చేయగలరా? అని అడిగింది. అందుకు సుబ్బారావుగారు అంగీకారం వెలిబుచ్చారు ఆ తల్లి మృదుమందహాసంతో ఆ భక్తుని కోరికకు సంతోషాన్ని ప్రకటిస్తూ, కొంత కాలం తండ్రిగారితోపాటు, వైశ్యధర్మసత్రంలో గడపాలని నిశ్చయించింది. ఈ బాల యోగిని శిరస్సు మీద ఒక దివ్య సర్పం పడగ విప్పి ఛత్రంగా పట్టేదని చూచిన కొందరు చెపుతారు.

7) ఈ అమ్మ దొడ్డా వారి సత్రంలో ప్రవేశించిన మీదట కొందరు భక్తులు, భగవంతుని చేరడానికి మార్గమేమైనా తెలుపమని కోరగా, ఆ తల్లి బోధించిన సందేశాలివి:-

"భగవంతుణ్ణి చేరడానికి చాలా మార్గాలున్నాయి అసలు భగవంతుణ్ణి చేరాలనే బుద్ధి పుట్టటమే ఒక పూర్వ జన్మ సుకృత విశేషం అలాంటి బుద్ధి కలిగి అది తుది దాకా కొనసాగడం ఇంకొక మహాపుణ్యం. చిరకాలం సాధన చేసి, భగవంతుణ్ణి చేరుకోవాలేగాని, అది ఒకరు చెప్పి చేయించేది కాదు. ద్వేషభావంతో హిరణ్యాక్ష, హిరణ్యకశపులు భగవంతుని చేరుకొన్నారు అమాయకంగా నమ్మి కొలిచిన శ్రీప్రహ్లాదుడికి తానే దర్శనమిచ్చి కృతార్థుణ్ణీ చేశాడు భగవంతుడు మూఢభక్తితో బోయతిన్నడూ, గాన మాధుర్యంతో మీరాబాయి, భక్తి ప్రపత్తులతో సక్కుబాయి పరమాత్మను కలుసుకొన్నారు అలాగే ఆత్మ విశ్వాసంతో భగవంతుని చేరుకోవాలేగాని, వారినీ, వీరినీ దేవుడెక్కడ అని అడిగితే ప్రయోజనం లేదు సత్ప్రవర్తన, భూతదయ, పరోపకారము మొదలైన సంగుణాలు అలవడిన తరువాత భగవద్దర్శనం".

8) ఈ విధంగా భక్తులకు బోధచేసి 25.3 1972వ తేదీన చైత్రశుద్ధ ఏకాదశినాడు, ఒక గూటిని శుభ్రపరచుకొని లోపల ప్రవేశించి తనచుట్టు గుడ్డ తెరలు వేసుకొని సమాధి నిష్ఠలో ప్రవేశించింది బాలయోగిని ఆహార పానీయాలు, మలమూత్ర విసర్జనలు లేనేలేవు ఈ విషయం గుంటూరు నాలుగు మూలలకు ప్రాకిపోయింది దర్శనార్థమై వచ్చిపోయే, స్త్రీ, బాల, యువక, వృద్ధలకు అంతు అంటూ లేదు. ఈ తల్లి మూర్తిదర్శనం ఎవరకీ లేదు. తెరలో చూచి నమస్కరించి రావటమే. శ్రావణ శుద్ధ పూర్ణిమకు ముందు ఒక శుక్రవారం నాడు, ఆ తల్లి కూర్చున్న గది దివ్యకాంతులతో నిండిపోయింది ఆ వెలుగును ఎందరో చూచి ధన్యులయినారు ఇలాంటి వెలుగే అప్పడప్పడు వస్తువుండేదట కొందరికి ఏవేవో అలౌకిక దివ్య పరిమళాలు తోచేవట ఇట్టివన్నీ కల్పితాలనీ, బూటకములనీ తెగడేవారు ఎల్లపుడు వుంటూనే ఉంటారనుకోండి. యోగుల విషయంలో ఇలాంటి అతీత దివ్య శక్తులు ఆశ్చర్యం కాదని పంతజలి, ప్రభృతి యోగశాస్త్రకారులు వ్రాసేవున్నారు.

9) ఒకానొక జంగమురాలు పెద్దవారింటలేనపుడు వచ్చి, ధూపంవేసే నేపంతో నిప్పతెప్పించి, తెరకు నిప్పంటించి, ఆ నిప్పమీద గుప్పెడు మిరపకాయలు పోసినదట. ఆ కోరునకు తట్టుకోలేక ఇరుగు పొరుగువారు వచ్చి చూడగా,

ఫలించలేదు ఆమె సమాధికి భంగం కలుగలేదు ఈ విధంగానే కొందరు సాధువులమంటూ వచ్చి అమ్మ యోగభంగం చేయాలని ప్రయత్నించి, చివరకు వారే భంగపడి పోయిన ఉదాంతాలు ఎన్నోవున్నాయి 25.3.1972 నాడు సమాధిలో ప్రవేశించిన ఈ బాలయోగిని 17.2.1973 మాఘ పూర్ణిమ శనివారము నాడు సమాధి నుండి లేచినది అప్పుడు స్నానములు నిర్వర్తించి మరల కూర్చిండి 15.10.1974 భాద్రపద మహాలయ అమావాస్యనాడు లేచినది ఈవిధంగా ఆమె ఎప్పుడు సమాధినుండి లేచేది ఎవరికీ తెలియదు. ఇక కొంతకాలానికి, సమాధి చాలిస్తుందనగా, గొప్పవెలుగొకటి ఆమె కూర్చున్న గది నంతటినీ ఆవరిస్తుందని చెప్తారు ఆ పిమ్మటనే ఆ తల్లి సమాధి సముత్థానం ఇలాంటి మహిమలవల్ల ఆ తల్లి మీద ఆసక్తికులకు, భక్తులకు, భక్తివిశ్వాస గౌరవాలు ఏర్పడినాయి. కొందరికి రోగ నివారణలు అయినాయి. కొందరికి మనస్సులోని కోరికలు నెరవేరినాయి సంతానం లేనివారికి, సంతాన ప్రాప్తికలిగింది కొంతకాలమయిన తరువాత ఈ సత్రంలో అమ్మ తల్లి దండ్రులు అనేక కష్టాలను ఎదుర్కోవలసి వచ్చినందున, అమ్మను ఒక చెక్కపెట్టెలో పెట్టుకొని వారి స్వగ్రామమయిన "రాజుపాలెం" స్వగృహానికి చేరారు అప్పటినుండి ప్రతిశుక్రవారము, అమ్మగారి తల్లి యైన భద్రమ్మగారి ఆధ్వర్యములో అమ్మకు పూజా పురస్కారములు జరుగుతున్నాయి. ఇప్పటికే ఎంతోమంది భక్తులు ప్రతిశుక్రవారం అమ్మను కొలుచుకొని వారి కోరికలను పండించు కొంటున్నారు ఈ వివరాలన్ని అమ్మ గారి తలి దండ్రుల వద్ద నుండి స్వీకరించినట్టివే

10) అణిమాది అష్ట సిద్ధులను పొందిన యోగసిద్ధుల సేవ ఏ ఫలితములను ఇవ్వదు? వారు ఒక మహాప్రభావ సముద్రము వంటివారు. ఆ సముద్రంలో నుండి ఎవరికి కావలసిన రత్నాలను వారు పొందవచ్చు ననడంలో సందేహంలేదు భారత దేశంలో యోగవిద్యకాని, వేదాంతంకాని చావకుండా, బ్రతికి ఉన్నదనడానికి ఇలాంటి మహాత్ములే దర్శనం. ఇందులో మోసంగాని, వంచనగాని వున్నదనుకోవడం అతీంద్రియ జ్ఞానంమీద విశ్వాసం లేకపోవడమే ఈమె వయస్సు 48 సంవత్సరాలు తలిదండ్రులు పల్లెటూరు వారయినందున పుట్టిన తేదీ మొదలయిన విశేషములను గ్రంథస్థం

చేసుకొనలేదు ఈ వయస్సు కొండ గుర్తుగా అంచనావేసి తెలుసుకొన్నదే నరసరావుపేటలో ఈమె పుట్టిన ఆస్పత్రిలో విచారిస్తే సరైన పుట్టిన తేదీ, సంవత్సరము చిక్కవచ్చును విరోధినామ సంవత్సర ఆశ్వీజమాసం బహుళ అష్టమి రోజున అమ్మ పుట్టినారు ఈ తల్లి రాజుపాలెంలో పితృగృహంలోనే సమాధి నిష్ఠురాలై తెరలోపలనే వుంటుంది. దర్శనార్థులు ఫలపుష్పాదులను తెరకీవల వుండే సమర్పిస్తూ వుంటారు

# అమ్మవారి ఉత్సవములు

అమ్మవారి ఉత్సవములు రాజుపాలెంలో 1980వ సంవత్సరము నుండి ఈ క్రింద చూపబడిన ప్రతి మాఘపౌర్ణమి రోజున వైభోపేతంగా జరిగాయి.

31 1 1980 సిద్ధార్థి నామ సంవత్సర మాఘ పూర్ణిమ

24 4 1980 రౌద్రి నామసంవత్సర వైశాఖశుద్ధ దశమి
(శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామివారి ఆరాధన)

18 2 1981 రౌద్రి నామ సంవత్సర మాఘ పౌర్ణమి

8.2.1982 దుర్మతి నామ సంవత్సర మాఘ పౌర్ణమి

28.1 1983 దుందుభి నామ సంవత్సర మాఘ పౌర్ణమి

17.2.1984 రుధిరోద్గారి నామ సంవత్సర మాఘ పౌర్ణమి

8.2 1985 రక్తాక్షినామ సంవత్సర మాఘ పౌర్ణమి

24.2.1986 క్రోధన నామ సంవత్సర మాఘ పౌర్ణమి

13 2 1987 అక్షయనామ సంవత్సర మాఘ పౌర్ణమి

2.2.1988 ప్రభవనామ సంవత్సర మాఘ పౌర్ణమి

ఈ ఉత్సవాలలో ఆధ్యాత్మికోపన్యాసాలు, భగవత్కథాకాలక్షేపములు, భజనలు, మొదలగు కార్యక్రమములు లెస్సగాను, భక్తి ప్రపత్తులతోను జరిగాయి ఎంతో దూర ప్రదేశములనుండి భక్త జనం వచ్చి ఉత్సవాలను

భజనలు, మొదలగు కార్యక్రమములు లెస్సగాను, భక్తి ప్రపత్తులతోను జరిగాయి ఎంతో దూర ప్రదేశములనుండి భక్త జనం వచ్చి ఉత్సవాలను తిలకించారు నేను కళాప్రపూర్ణ డా॥ కొండూరి వీరరాఘవాచార్యులుగారు ఉత్సవములలో పాల్గొని అమ్మ కృపకు పాత్రులు కాగలిగినాము. ప్రతి ఉత్సవములోనూ శ్రీకొండూరువారు అజ్ఞాతమైయున్న అమ్మ యొక్క ప్రభావాన్ని, అమృత తత్త్వాన్ని గూర్చి కొన్ని వేలమంది భక్తజన సందోహంలో గంభీరోపన్యాసములు చేశారు, ఇంకా కొంత మంది ప్రముఖులు గూడ వచ్చి ఆధ్యాత్మిక వేదాంతో పన్యాసములు చేశారు ఎంతోమంది భక్తులు ప్రతిసారి సమధికోత్సాహములో పాల్గొని వారి సహాయసంపత్తులు అందజేశారు. సత్తెనపల్లి విశ్వ బ్రాహ్మణ సంఘ ప్రసిడెంట్ శ్రీ యన్. వెంకటాచార్యులుగారు ప్రతి మాఘ పూర్ణిమ రోజున ఉత్సవాలలో పాల్గొని వందన సమర్పణ చేశారు

# అమ్మ దివ్య దర్శనములు

**1) 23.7.1980 అమ్మ ప్రథమ దివ్య దర్శనము :-** తొలి ఏకాదశి రోజున అనగా రౌద్రినామ సంవత్సర శుద్ధ ఏకాదశి బుధవారం రోజున అమ్మ మూర్తి దర్శనం ఇచ్చింది వేలాదిమంది భక్తులు వచ్చి అమ్మ సన్నిధానములో భజనలు పూజలు చేసి ధన్యులైనారు ఉదయం 5 గంటల నుండి రాత్రి 11.00 గంటల వరకు వేలాది మంది భక్తులు దర్శనం చేసుకొన్నారు రాజుపాలెంలో ఇది అమ్మగారి ప్రథమ దర్శనం - ఇది చాలా పవిత్రమైన రోజు నేనూ కళాప్రపూర్ణ డా॥ కొండూరి వీరరాఘవాచార్యులుగారు తెనాలి నుండి వెళ్ళి అమ్మ దర్శనం చేసికొని ధన్యులైనాము.

**2) 17.2.1985 అమ్మ రెండవ దివ్య దర్శనం:-** మహా శివరాత్రి రోజు అంటే 17.2 1985వ తేదీన రక్తాక్షినామ సంవత్సర మాఘ బహుళ త్రయోదశి ఆదివారం నాడు అమ్మ మూర్తి దర్శనం ఇచ్చినది. అశేష భక్త జనము వచ్చి ఆ తల్లి దర్శనము చేసుకొని తరించినారు. ఆ రోజు మహాశివరాత్రి మహా పవిత్రమైనరోజు సుమారు లక్ష మంది భక్తులు అమ్మ దర్శనం చేసుకొని ధన్యులైనారు. తెనాలి నుండి నేనూ, కొండూరు వారు కూడ రాజుపాలెం వెళ్ళి అమ్మ దివ్యదర్శనము చేసుకున్నాము.

**4.4.1992న అమ్మ మూడవ దివ్య దర్శనము :-** తెలుగు సంవత్సరాది రోజున అనగా ఆంగీరసనామ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి, శనివారము రోజున అమ్మ మూడవ సారి మూర్తి దర్శనము ఇచ్చినారు లక్షలాది మంది భక్తులు వేకువ జామున 3 గంటలకే క్యూలో నిలబడి రాత్రి 11 00 గంటలవరకు అమ్మను కన్నులారా చూచుకొని, చేతులారా పూజించి, మనసారా ఆరాధించుకొన్నారు ఈ సారి డా॥ కొండూరి వీరరాఘవాచార్యులు గారు రాలేక పోయినారు తేనాలి నుండి నేనూ, శ్రీ అత్తలూరి నాగభూషణముగారు (రిటైర్డు డిప్యూటి కలెక్టర్) రాజుపాలెం వెళ్ళి అమ్మ దర్శనము చేసుకొన్నాము. ఈ మూడవ దర్శనము ఇవ్వబోయే నాటికి, ఈసారి కొంత మంది భక్తులు అమ్మ సమాధి నిష్ఠ కొరకు ప్రత్యేకించి ఒక భవనమును నిర్మించినారు ఆ భవనంలోనే అమ్మ అందరకు మూడవసారి దర్శనము ఇచ్చినది మళ్ళి అమ్మ ఎప్పుడు దర్శనమీయనున్నదో తెలియదు

పై ఉత్సవ కార్యక్రమములకు అమ్మవారి మూర్తి దర్శనములకు ఎంతో భక్తి శ్రద్ధలతో ముఖ్య కార్యకర్తృత్వము వహించివారు శ్రీ పూండ్ల భానుప్రసాదు దంపతులు గారు వీరు అమ్మ పాద సేవ చేసుకుంటూ, పై కార్యక్రమములన్నింటిని ముఖ్య భాధ్యత వహిస్తూ, ఆయా కార్యక్రమములన్నింటిని ఇతర భక్తగణ సహాయంతో జరిపించారు భానుప్రసాదుగారి సతీమణి "సరోజిని". ఈమె అమ్మగారి సేవచేసుకుంటూ ప్రతి శుక్రవారం అమ్మ దర్శనం చేసుకుంటు ఉండేవారు ప్రతి ఉత్సవములో అక్కడకు వచ్చిన భక్తాధులకు భానుప్రసాదు దంపతులు భోజన సదుపాయములు ఏర్పాటు చేస్తూఉండేవారు అమ్మగారికి పాదుకలు, త్రిశూలం సమర్పించుకొని తరించినవారు. శ్రీమతి సరోజినిగారు భానుప్రసాదుగారి సతీమణి తేదీ 10.5 1986న నిర్యాణము పొందినారు అమ్మ సేవ చేసుకుంటూ ప్రశాంత జీవితమును గడుపుకుంటున్న భానుప్రసాదుగారు ధన్యజీవి

రాజుపాలెం అమ్మ సమాధిలో కూర్చుండిన నాటినుండి నేటి వరకు, తనను ఆరాధించే భక్తుల కోరికలను నేరవేరుస్తూ, వారిని కాపాడి రక్షిస్తూనే

విషయాలు నిజమని మనము నమ్మవలసి వస్తున్నది ఇందుకొక ఉదాహరణ చూద్దాము

బ్రహ్మంగారు బ్రతికి ఉండగానే సజీవ సమాధి అయినారని మనకు తెలిసిన విషయమే ఆయన సమాధి కాబోయేటప్పుడు భార్య అయిన గోవిందమ్మగారితో "నీవు లోకాచార ప్రకారము ముత్తైదు చిన్నెలయిన మంగళ వస్తువులను తొలగించవద్దు. భర్త మరణిస్తే ఆ పని చేయవచ్చు కాని నాకు మరణం లేదు ఈ శరీరములోనే చాలా కాలముంటాను అందువల్ల నీకు వైధవ్యమనేది లేనేలేదు నీవు ముత్తైదువు గానే నా వలె సమాధి అవుతావు" అని చెప్పి సమాధిలోనికి వెళ్లిపోయినారు. ఆ జగన్మాత అలాగే మాంగల్యాదులను తీయలేదు. కొంత కాలము జరిగేటప్పటికి సమాజంలో బ్రహ్మంగారు చనిపోయినా, భార్య గాజు పూసాతీయలేదని గొప్ప నిందలు బయలుదేరినాయి ఆ తల్లి సమాజానికి అనేక విధాల నచ్చజెప్పింది. లోకులు కాకులు గదా! గురుదేవులు జీవించేఉన్నారని గోవిందమ్మగారు గాజు పూస తీయక పోవడం దోషం లేదని ఆ సమాజం గ్రహించలేకపోయింది. దేశం నలుమూలల నుండి వచ్చిపడే నిందావాక్యాలు బాణాల లాగా గ్రుచ్చుకొనసాగాయి. దుడుకు కొడుకైన పోతూలరయ్య ఆ మాటలను విని సహించలేక పోయినాడు సోదరులను, తల్లిని, చివరకు ఈశ్వరమ్మ గారిని గూడా ధిక్కరించి దౌర్జన్యముతో సమాధిని తెరిచి చూసాడు బ్రహ్మంగారు సంవత్సరమునాడు ఎలా సమాధిలో కూర్చున్నాడో అలాగే ఈనాడూ ఉన్నారు. పద్మాసనం చెదరలేదు. చిన్ముద్ర చిన్నెలు తారుమారుకాలేదు. ముఖంలో బ్రహ్మవర్చస్సు తాండవించుతున్నది. శ్వాస ప్రశ్వాసలు ఆడడం లేదు. ఆయన చుట్టూ కాంతి వలయం క్రీడిస్తున్నది. అయినా మూర్ఖుడయిన ఆ కుమారునికి విశ్వాసం, కుదిరింది కాదు వెనుక వైపునకు పోయి స్వామి రెండు భుజాల మీద రెండు చేతులు వేసి ఆయనను వెనుక ముందులకు కుదిపినాడు ఎవడురావాడు. వాడి వంశము నిర్వంశము కాను." అని బ్రహ్మంగారు మరల సమాధిలోనికి పోయినారు

ఈ సంగతిని అవిశ్వాసులయినవారు నమ్మకపోవచ్చును. అందులో నమ్మకపోవడానికి తగిన వింత ఏమీలేదని యోగ శాస్త్రము, యోగుల

అనుభవాలు చాటుతూనే ఉన్నవి ఆనాడు బ్రహ్మంగారు ఏ కుండలినీ యోగాన్ని అవలంబించి జీవించకలిగినారో, అలాగే ఈనాటి మన రాజుపాలెం అమ్మ కూడా చిరకాలం ప్రపంచంతో స్పర్శ, సంబంధం లేకుడా ఉన్నదని మనము సమాధానపడాలి.

కుండలినీ యోగంలో ముఖ్య ప్రాణవాయువు సుషుమ్నా మార్గంలో సూక్ష్మాతి సూక్ష్మంగా సంచరిస్తూ ఉంటుంది సూక్ష్మ శరీరంలో ఉన్న రజోగుణమయ పంచప్రాణాలు కూడా సుషుమ్నా గతములయ్యే సంచరిస్తాయని కుండలినీ యోగీశ్వరుల అనుభవం చాటుచున్నది జీవ సమాధిలో ఉన్న మహనీయులంతా, దుర్లభమయిన ఇలాంటి యోగ ప్రక్రియను అలవాటు చేసుకొనియే సమాధిలో ఉంటారు ఆనాటి బ్రహ్మంగారే కాదు ఆయన గారి శిష్య ప్రశిష్యులు, పుత్ర పౌత్రాదులు, సిద్ధప్ప ఆయన శిష్య పరంపర, ఇలాంటి యోగ ప్రక్రియను అవలంబించే జీవసమాధి గతులై ఉన్నారని మనము గ్రహించాలి

ఆనాటి బ్రహ్మంగారిని బట్టి, ఈనాటి రాజుపాలెం బాలయోగిని స్థితిని, ఈనాటి రాజుపాలెం అమ్మను బట్టి, ఆనాటి బ్రహ్మంగారు మొదలయిన మహనీయుల జీవసమాధి స్థితిని ఊహించి తెలుసుకొని తృప్తిపడవచ్చు. అంతే కాదు ఆ మార్గాన్ని సాధించి, మనం కూడా అలాంటి సిద్ధిని పొందనూ వచ్చు మానవుడైనవాడు పట్టుదలతో, నిగ్రహంతో, త్యాగంతో పూనుకొన్నట్లయితే సాధించలేని కార్యం ఏముంటుంది చెప్పండి ఈ చెప్పకున్న లక్షణాలు మనలో ఉండవు. మనమేదో కొంత సాధన చేసినా ఏ ప్రాపంచిక ప్రలోభాలకో లోబడిపోయి మన సాధన ప్రక్రియ నుండి తిరోగమిస్తూ ఉంటాము అలాకాకుండా మనలను ఆకర్షించే ప్రాపంచిక లోభాలను, త్యాగంచేసి లేదా తగ్గించుకొంటూ లక్ష్యం మీద చెక్కు చెదరిని దృష్టిని పెట్టి పయనం కొనసాగిస్తే ప్రతివాడు కొంతకు కొంతయినా సిద్ధిని సంపాదించటంలో ఆశ్చర్యమేమీ ఉండదని అస్మదాదుల అనుభవం చాటుతున్నది.

ఈనాటి అమ్మ స్థితి ఇలాంటిది ఆమె జన్మజన్మాంతరాల యోగ పరిణామ ఫలంగా ఈ స్థితిని అందుకోగలిగింది ఆమె తలిదండ్రులు కాని, మనం గాని ఎరిగినంతలో ఆమెకు గురువంటూ ఎవరూ లేరు ఏడెనిమిదేళ్ల

ప్రాయంలోనే బడి వదలగానే ఊరు దాపున ఉన్న చిట్టిడివిలోకి పోయేది ఏదో ఒక చెట్టు క్రింద పద్మాసనం వేసుకొని, కన్నులు మూసుకొని కూర్చునేది ఏదయినా మంత్రము జపించేదో లేదో మనకు తెలియదు అసలు ఆమెకు మంత్రాలేమిటి? మంత్రాలెందు కామెకు? మంత్రానికి మూలమయిన శబ్ద బ్రహ్మము యొక్క వైఖరీ స్థితిని దాటి, మధ్యమావస్థను అతిక్రమించి, పశ్యన్తిని దిగవిడచి, పరాస్థితి నందుకొన్న ప్రజ్ఞాన స్వరూపిణి ఆ తల్లి, అమె, కర్మశేషం వల్ల ఈ శరీరాన్ని ధరించి ఈ తలిదండ్రుల కడుపున పడ్డదని మనమనుకోవాలి. ఆమె (స్థూల శరీరగత) తమోగుణ ప్రధాన, శరీరేంద్రియ వ్యాపారాలు ఆమెకే నాడో వశమైపోయినవి. సూక్ష్మ శరీరగత ఏకాదశేంద్రియాలు, పంచ ప్రాణాలు ఆమె స్వాధీనములోనివే. ఏ ఇంద్రియం కాని, ఏ ప్రాణం కాని, ఆమె ఆజ్ఞ లేకుండా స్పందించటానికి వీలే లేదు ఆమె కన్నులు మూసుకొని కూర్చుందంటే అంతశ్శరీరములో జరిగే యోగ ప్రక్రియ ఇలా ఉంటుంది. ఏనాడో మేలుకొని ఆధారం నుండి బయలుదేరి స్వాధిష్టానాదులను ఛేదించుకొంటూ, ఊర్ధ్వప్రయాణం చేస్తున్న ఆమె యొక్క కుండలినీ శక్తి, మీదకి వ్యాపించియున్న తన తోకను ఆధారానికి చేర్చి, అధోముఖమయి ఉన్న శిరస్సును ఉర్ధ్వానికి పంపుతుంది. ఆ క్రియలో సర్వేంద్రియ వృత్తులు కట్టుబడపోతాయి జ్ఞాన కర్మేంద్రియ వృత్తులు కట్టుపడటంతో నాలుగు ప్రాణాలు, ముఖ్య ప్రాణంతో మైత్రి నెఱపి సుషుమ్నా మార్గాన, సూక్ష్మంగా సంచారం ప్రారంభిస్తాయి బాహ్యచలన మంటూ ఏది ఉండదు జీవోపాధి అయిన కారణ శరీరం అంటే అనాది అవిద్య తనలోని మాలిన్యాన్ని ఏనాడో కడిగివేసుకున్నందు వల్ల ఆమె జీవుడు శుద్ధ సత్వమే ఉపాధిగా కలిగినవాడు అయినాడు అంటే మాయోపాధికుడన్నమాట అవిద్యోపాధికుడు జీవుడని, మాయోపాధకుడు ఈశ్వరుడని, వేదాంతు లందరికి తెలిసిన విషయమే. ఇలాంటి తల్లి రక్త మాంసమయ శరీరంతో ఉన్న జగదీశ్వరి గాక ఇంకేమౌతుంది!

అతి సంగ్రహంగా పరమ రహస్యంగా వర్ణించుకున్న అమ్మ స్థితి ఇట్టిది! ఆమెకు ఆకలి దప్పులు గాని ప్రాణచలనంకాని, ఇంద్రియ ప్రవృత్తులుగాని శరీర స్పందనగాని, ఎలా ఉంటుంది. ఈనాటి అమ్మ స్థితి ఇట్టిది! ఇలాంటి తల్లిని అర్థంచేసుకొని ఆరాధించి కొలిచే వారికి తమ కోర్కెలు నెఱవేరటంలో,

తమ రోగాలు నివృత్తి కావటంలో తమకు కావాలనుకొంటే యోగసిద్ధి దగ్గర కావడంలో, ఆశ్చర్యమేమున్నది మీకు విశ్వాసం కుదరాలి తత్త్వం తెలియాలి. తగిన సాధన చేయాలి ఫలాన్ని పొందాలి ఆనాడు మీరు అమ్మను అర్థము చేసుకొన్నవారు, ఆమె మార్గములో నడవబూనుకొన్నవారు, ఆమె అడుగులో అడుగు వేసుకుంటూ ఆ తల్లి చేరిన గమ్యానికి ప్రయాణించేవారు కాగలుగుతారు. అందుకీ నాడే శ్రీకారం చుట్టండి

## 2. అమ్మది ఏ యోగం

ఇంతకు అమ్మ పూనినటువంటిది ఏ యోగమని సందేహం చాలా మందికి కలుగవచ్చు కర్మ, జ్ఞాన, భక్తి, యోగాలను అలా ఉంచి చూచితే, అష్టాంగయోగం, కుండలినీయోగం, హఠయోగం, రాజయోగం, సమాధి యోగం, మొదలైనవి ఎన్నో ఉన్నాయి ఇవికాక అనుభవపరులైన యోగులు కనిపెట్టిన యోగాలు కూడా కొన్నికలవు కొన్ని కొన్ని యోగమార్గాలు, శాస్త్రంలోనికి ఎక్కలేదని కూడ పెద్దలు చెప్పతూ ఉంటారు శాశ్వత సమాధిలో చిరకాలంగా ఉండే యోగం ఏదో, బ్రహ్మంగారి వంటిమహనీయులు పూనిన యోగం ఏదో, ఇంకా మనకు అంతు పట్టనే లేదు అలాంటి యోగమార్గలన్నీ వారి శిష్యపరంపరలో మాత్రమే ఉపదేశించ బడుతూ, శిష్యులకు మాత్రమే అందుతూ ఉంటాయనే కొందరు చెపుతూ ఉంటారు ఇది సత్యం కావచ్చు. అలాంటి మహనీయులకు పుస్తకాలు, ఉపన్యాసాలు, ప్రచారాలు అంటే గిట్టదు ఆలోచించి చూస్తే అమ్మది ఇలాంటి అద్భుత యోగమని అనిపిస్తుంది అయినా శాస్త్రాలకు అందినంత వరకు మనం ఆలోచించి చూడవచ్చు

శ్లో॥ ద్వైతాద్వైత సముద్భేదైర్జగన్నిర్మాణ లీలాయా
పరమాత్మమయీ శక్తి రద్వైతేన విజృంభతే

తా॥ ఒకటే అయిన పరమాత్మ శక్తి తన జగన్నిర్మాణము చేత ద్వైతాద్వైత రూపంగా విజృంభిస్తూ ఉంటుంది దీన్ని బట్టి చూస్తే ద్వైత భావంతో ప్రారంభించిన తనయోగ మార్గాన్ని అద్వైత భావంలో విలీనం చేసి ద్వైతా ద్వైత లీలా స్వరూపిణిగా విహరించినట్లు మనం అర్థం చేసుకోవచ్చు ఈ

స్థితి రావాలంటే చిరకాలం- అంటే జన్మ జన్మాంతరాలుగా ఎంతో అభ్యాసం చేస్తే కాని, అది చేకూరదు ఈ విషయాలన్నీ మనం యోగవిశిష్ఠంలోని ఉపశమ ప్రకరణంలో చూడగలుగుతాము స్థూలంగా అమ్మ చరిత్రను, అంటే- "అక్కడ అలాపుట్టింది ఇక్కడ ఇలా పెరిగింది అలా మోక్షంపొందింది" అని చెప్పకోవాలంటే ఈ వివరణ అంతా మనకు అక్కరలేదు దానివల్ల అభ్యాసం చేయదలచిన సాధకులకు ప్రయోజనం ఏమి ఉండదు కనుక ఆమె యోగమార్గాన్ని శాస్త్రీయ దృక్పథంతో చూడాలంటే ఈ విశేషాలన్ని పాఠకులు తెలుసుకోక తప్పదు. ఈ విషయంలో యోగవాశిష్ఠ వాక్యాల ద్వారా కొంత పరిశీలన జరుపుదాం

శ్లో॥ ఆత్మారామో వీత శోకో, భవత్యంతస్సుఖి . పుమాన్
అభ్యాసాదేవ నాన్యస్మా, త్తస్మా దభ్యాసవాన్ భవ॥

78-సర్గ, 45-శ్లోకం

తా॥ ఓ సాధకుడా నీవు శోక మోహములను విడిచి, ఆత్మ యందే రమించడం నేర్చుకొని, అంతస్సుఖాన్ని చూరగొనాలంటే అది అభ్యాస యోగం లేకుండా సాధ్యంకాదు కనుక నీవు నిరంతరం ఎడతెగ కుండా అభ్యాసం చేసే వాడివి కావాలి

అమ్మయొక్క పూర్వజన్మల యందలి అభ్యాస విశేషాలు మనకు తెలియకపోయినా, ఈ జన్మలో ఆమె చేపట్టిన అభ్యాస విధానం, ఆమె తల్లి దండ్రుల ద్వారానో సమకాలీన జనుల ద్వారానో, మనము తెలిసుకుంటూనే ఉన్నాము. ఆ తల్లి బాల్యం నుండి కూడా ఏకాంత ప్రదేశంలో కూర్చుండి, ఆహారాదులను స్వీకరించి కొన్నాళ్లు, స్వీకరించకుండా కొన్నాళ్ళు అభ్యాసం చేసిందని, మన అందరికీ తెలుసు. ఈ విషయాన్నే శాస్త్రం ఎలా చెపుతుందో చూడండి.

శ్లో॥ అభ్యాసేన పరిస్పందే, ప్రాణానాంక్షయమాగతే,
మన : ప్రశమ మాయాతి నిర్వాణ మవ శిష్యతే - 46.

తా॥ నిరంతరము చలిస్తూ ఉన్న ప్రాణము (శ్వాస ప్రశ్వాసలు) ఎడతెగని

సాధన వల్ల, నిశ్చలమై ప్రకాశించినప్పుడు, ఆ యోగియొక్క మనస్సు చలించదు అది కూడ ప్రాణంలాగానే శమిస్తుంది. మనస్సు శమించినప్పుడు, అంటే అమనస్క స్థితి ఏర్పడిన సమయంలో మిగులు నటువంటి ఆత్మస్థితినే నిర్వాణ మని అంటారు. ఇక్కడ కొంత వివరణ అవసరం కొంత సాధన జరిగేటప్పటికి, యోగి యొక్క ప్రాణ వాయువు సుషుమ్నా మార్గంలో సంచరిస్తుంది అప్పుడు దానికి ఈ బాహ్యసంచారం ఉండదు ఇలా ప్రాణం నిశ్చలమైనప్పుడు, అతని మనస్సు గూడా, రజస్త మోగుణాల అలజడికి లోనుకాకుండా, కేవల సత్వగుణంతో నిండి, ఆ సత్వం గూడా శుద్ధమై, శమిస్తుంది. ఆ దశలో మిగిలేది కేవలాత్మ మాత్రమే అని పై శాస్త్రవాక్యానికి అర్థం ఆ స్థితినే మోక్షం అంటారు ఇంతకు మించి భిన్నంగా, మోక్ష మనేది ఏ ప్రదేశములోనో, ఏ కాలంలోనో చేకూరేదికాదు అంటే మోక్ష స్వరూపమే అయిన నీమీద కప్పకొన్న ఆవరణలను తొలగించుకొని, నిన్ను నీవు అభివ్యక్తం చేసుకొనటమే మోక్షమంటే ఈ సమ్యగ్యోగమార్గాన్ని అమ్మా "తన స్థితి ఇదీ, ఇది ఇట్టిదీ" చెప్పకుండానే అనుష్ఠించి, సూక్ష్మ బుద్ధులయిన శిష్యులకు మార్గోపదేశం చేసింది. "బ్రాహ్మీ స్థితి అంటె ఇదే నాయనలారా" అని అనుష్ఠానం ద్వారా చాటింది ఆమె స్థితిలో ఇంతవరకు ఎంత శాస్త్ర సమ్మత మయినదో మనం అర్థం చేసుకొనే ఉంటాము అమ్మ యోగ మార్గాన్ని శాస్త్రవాక్యాలతో ఇంకా వివరించి విశదంగా తెలుసుకుందాము

శ్లో॥ ప్రాణ స్పందో మనోరూపం, తస్మాత్ సంస్కృతి విభ్రమః,,
తస్మిన్నేవ శమం యాతే, లీయతే సంసృతి జ్వర

తా॥ ప్రాణాలు చలించటం వల్లనే మనస్సుకు రూపం ఏర్పడుతుంది దానికి రూపం ఏర్పడగానే సంకల్పాలు, వాటితో ఆకాశాదులు కలుగుతాయి మనస్సు చలించిందంటే సంసారం విజృంభిస్తుంది ఆ మనస్సే కనుక శాంతి పొంది తాను లేకుండా పోయిందా అంటే, అహంకారము మొదలు దేహం వరకూ గల సంసారమనేది ఉండనే ఉండదు ఈ శ్లోకభావం అమ్మ విషయంలో పూర్తిగా మనం చూడగలుగుతాము ఆమె ప్రాణ సంచలనాన్ని ఏనాడో అరికట్టింది. దానితో ఆకలిదప్పలతో బాటు సర్వేంద్రియచలనాలు, నిరోధింపబడి, అంతరింద్రియమైన మనస్సు గూడా శూన్యమై పోయింది మనస్సే లేనప్పుడు ఇంకా సంసారమే ముంటుంది. సుషుప్తిలో నిన్ను సుఖదుఃఖాలు బాధిస్తున్నవా?

# 3. లోకంతో పొత్తు లేక పోవటం

క్రొందరు యోగులు జ్ఞానులు లోకంతో ఏ విధమయిన సంబంధం పెట్టుకోకుండా మౌనంగా తిరుగుతూ ఉంటారు అలాంటివారు మనం మాట్లాడిస్తే మాటాడనూవచ్చూ మాటాడక పోవనూవచ్చు ఇలాంటి వారు ఎవరయినా ఇంత పండో, కాయో, ఆహారమో సమర్పిస్తే తీసుకుంటారు లేకపోతే లేదు. మరి కొందరేమో మౌనంగా తురీయ సమాధిలో కూర్చిండి బ్రహీ భూతులై ఉండిపోతారు. వారికి ఆకలిదప్పలే ఉండవు. ఇలాంటి వారికి లోకంతో సంబంధం ఉండదని వేరే చెప్పనక్కరలేదు. ఈ రెండు తరగతులవారిని గూర్చి శాస్త్రం ఏమంటున్నదో పరిశీలించినట్లయితే భగవద్గీతలో ఈ దిగువ ప్రమాణం కనపడుతున్నది

శ్లో॥ "యస్త్వాత్మరతిరేవ స్యాత్, ఆత్మ తృప్తశ్చ మానవ
ఆత్మన్యేవ చ సంతుష్ట స్తస్య కార్యం న విద్యతే"

తా॥ ఎవడు ఆత్మయందే రమింపనేర్చి, ఆత్మతోనే తృప్తిచెంది, ఆత్మయందే సర్వసిద్ధులు కలిగినట్టు సంతోషించి ఉంటాడో, అట్టివానికి చేయదగిన పని అంటూ ఏమి ఉండదు

ఈ శ్లోక భావాన్ని బట్టి చూస్తే అమ్మ ఈ స్థితిలో ఉన్నట్లు మనకు అవగాహన అవుతున్నది. ఆమె చిన్నప్పటి నుండే కూడా ఆత్మయందే రమించడానికి అలవాటు పడ్డది అందుకనే ఊహ వచ్చినప్పటి నుండీ ఎవరితోనూ ఏ విధమయిన సంబంధాలూ పెట్టుకొనడానికి ఇష్టపడేది కాదు చివరకు తనకు అన్నపానీయాలు అందించేవారి మీద కూడా అభిమానం కాని, నిరభిమానం కాని చూపేది కాదు. లేశ మాత్రమేదయినా అభిమానం ఉన్నదంటే అది తనను కన్నతల్లి మీద మాత్రమే ఉన్నట్లు అగపడేది అది సమంజసం కూడ. మోక్షానికి సాధనమయిన శరీరాన్ని ప్రసాదించిన కన్న తల్లి గనుక ఆమె మీద అలాగే తండ్రి మీద, ఆపాటి అభిమానం చూపటం యుక్తమే అని వేదం కూడా అంగీకరించినది అందుకే వేదం "మాతృ దేవోభవ పితృదేవోభవ" అన్నది.

శ్లో॥ "ఉపాధ్యాయాన్ దశాచార్య, ఆచార్యణాంశతంషతా
సహస్రంతు పితౄన్మాతా,, గౌరీవేణాతి రిచ్యతేష"

తా॥ పదిమంది విద్యాగురువుల కంటే మంత్రోపదేశం చేసిన ఒక గురువు గొప్పవాడు అలాంటి నూరుగురు ఆచార్యులకంటె తండ్రి గొప్పవాడు అలాంటి వేయిమంది తండ్రుల పెట్టు తల్లి

అందుకనే ఈ బాలయోగిని, తల్లి మీద బాల్యం నుండి అధిక గౌరవాన్ని చూపుతూ లోకానికి మాతృగౌరవాన్ని చాటినది. ఇక గురువనే వాడే తనకెవరూ లేరుగనుక, "ఆచార్య దేవోభవ" అన్నమాటకు ఆమె విషయంలో తావేలేదు ఆమెకె వరయినా గురువు ఉన్నారంటే ఆతడు సాక్షాత్తు ఆ పరమాత్ముడే. ఇలాంటి వేదాంతశాస్త్ర మార్గానికి చెందిన తల్లి గనుకనే ఆమెకు ప్రపంచంతో పొత్తు ఎంత మాత్రమూ లేకుండా పోయింది.

శ్లో॥ యోన్త: స్సుఖోంతరారామ స్తథాంతర్జ్యోతిరేవ య:
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతో ధిగచ్ఛతి"

గీత 5-24

పై శ్లోకం మాదిరిగానే ఈ శ్లోకం గూడా అంతరానందాను భూతిని పొందిన వారి స్థితినీ, మహిమనూ వక్కాణిస్తున్నది అనేకులు సుఖంకాని, ఆనందంకాని కావాలంటే బాహ్యవస్తులతో తమ ఇంద్రియాలను సంయోగ పరచికాని పొందలేరు. ఆ సుఖం అంటే విషయ ఇంద్రియ సంయోగం వల్ల కలిగినట్టిది శాశ్వతం కాదు క్షణంసేపు ఉండి నశించేది మాత్రమే ఇంద్రియ విషయ సంబంధం లేకుండా అనుభూతమయ్యే ఈ ఆత్మానందం శాశ్వతము ఉత్కృష్టము అయినట్టిది. అందుకే పై శ్లోకం ఇలా అంటున్నది

"ఎవడు తన అంతరాత్మయందే, అంతరాత్మతోనే ఆనందమును పొందునో, తన అంతరాత్మనే క్రీడారంగముగా చేసుకొనునో, అలాగే తన అంతరాత్మయే అఖండజ్యోతియై ప్రకాశించునో అట్టి అమనస్కయోగి లేదా కుండలనీ యోగి సాక్షాత్తు బ్రహ్మమే అయి బ్రాహ్మస్థితిని పొందగలడు".

దీనిని బట్టి చూచినట్లయితే అమ్మ - యోగాంగములలో చెప్పిన ధ్యాన, ధారణా, సమాధులను కూడా దాటి పోయి కేవలం నిర్వికల్ప, నిరంజన

ఇచ్ఛామయస్థితిలో ప్రకాశించుచున్నదని తెలుస్తున్నది ఆమెయోగంలో ధ్యానముచేసే తానుగాని, ధ్యేయమైన బ్రహ్మముగాని, ధ్యానమనే క్రియగాని ఏదీ లేదు అది త్రిపుటీ రహితము ద్వంద్వాతీతము కేవలాత్మస్థితి అఖండ బ్రహ్మమయము ఈ స్థితినే గీతాశ్లోకం అంతరారామము, అంతర్జ్యోతి అని వర్ణించినది ఇట్టి పరమాత్మైక స్థితిని పొందుట వల్లనే అమ్మ బాహ్య లోకము యొక్క సంపర్కం లేకుండా తన శరీర సంబంధమయిన ఆకలి దప్పలను, శ్వాస ప్రశ్వాసలను దాటె కేవలాత్మ స్వరూపిణి అయి ఉండజాలినది.

అయితే ఇలాంటి తత్త్వవేత్తలవల్ల, భగవత్స్వరూపుల వల్ల లోకానికి ప్రయోజనమేమిటి అనే ప్రశ్నపుట్ట వచ్చు దానికి సమాధానం - భగవంతుడనే వాడు ఒకడుంటే, అతనివల్ల లోకానికి ఏ ప్రయోజనం కలుగుతుందో అలాంటి ప్రయోజనం ఈ భగవత్స్వరూపుల వల్ల, తత్వవేత్తల వల్ల కలుగుతుందని మనం గ్రహించాలి భగవంతుడు కనపడకపోయినా, మాటాడకపోయినా, ఆయనను కొలిచేవారికి వారి కోరికలు నెరవేరుతూనే ఉన్నాయని మనలోకానుభవం చాటుచున్నది

అలాగే అమ్మ వంటి మహనీయులు కూడా మాటాడకపోయినా, దర్శనమీయకపోయినా, తమ్ము ఉపాసించి కొలిచేవారి వాంఛితాలు నెరవేర్చేతీరుతారు అంటే వారు సంకల్ప పూర్వకంగా ఈ పనిచేస్తారని కాదు. భక్తుల యొక్క భక్తి, ఆరాధనాది క్రియలే వారి వాంఛితాలను నెరవేరుస్తాయన్న మాట. అమ్మ జీవితంలో ఇలాంటి ఉదాహరణలను తరువాతి గ్రంథంలో మనం చదువబోతున్నాము.

శాస్త్రమనేది తత్త్వవేత్తలను ఇలా మౌనంగా ఉండేవారని, ఒక తెగనూ, అలాకాక, శాస్త్ర పరిజ్ఞానంతో పాటు అనుభవాన్ని కూడా పరిపూర్ణంగా సంపాదించి, భగవత్స్వరూపులై లోకోద్ధరణ కోసం బోధలు చేస్తూ, పుస్తకాలు వ్రాస్తూ, ఉపన్యాసాధిస్తూ తత్త్వ ప్రచారం చేసేవారని ఒక తెగనూ విభజించి చెప్పింది వీరినే “అధికార” పురుషులంటారు బ్రహ్మవిద్యా ప్రచారం చేసిన సౌనగ, సనాతన, వశిష్ఠాది మహర్షులు ఇటీవలి శంకరాచార్య వీరబ్రహ్మాదులు, ఈ అధికార పురుష వర్గానికి చెందేవారే అమ్మ వంటి మహనీయ మూర్తులు పురాణాల్లో వర్ణితులైన సనకసనందాదుల వంటివారు వారి కంటె కూడా

అతీతమార్గంలో ఉండేటటువంటి వారని అన్నప్పటికినీ శాస్త్రం ఆగ్రహించదు కనుక ఈనాటి అమ్మ స్థితి గీతలో చెప్పిన "యస్త్వాత్మరతి" అనే శ్లోకానికి లక్ష్యమైనదని పాఠకులు గ్రహించవలసి ఉన్నది

ఈ సందర్భంలో గురుగీతలలోని దిగువ శ్లోకం మననం చేయదగి ఉన్నది

శ్లో॥ గూఢశ్చ దృఢశ్చ, ప్రీతశ్చ, మౌనేనసుసమాహిత,
సకృత్కామగతశ్చేతి, పంచధాగురురీరిత ॥

తా॥ 1 గూఢుడు, 2 దృఢుడు, 3 ప్రీతుడు 4 మౌనముగా ఉండేవాడు, 5 ఒకేసారి సంకల్పించుకొనేవాడు అని అయిదు రీతులుగా ఉంటారు

1. "గూఢుడైన" బ్రహ్మవేత్త తాను బ్రహ్మజ్ఞాన సంపన్నుడైనప్పటికీ ఆ సంగతిని ఇతరులకు తెలియనీయకుండా, ఏ ఆశ్రమంలోనో, గుహలోనో, ఇంటిలోనో రహస్యంగా ఉండి తన యొక్క బ్రహ్మ నిష్ఠను అజ్ఞాతంగా కొనసాగిస్తూ ఉంటాడు

2. "దృఢుడనే" బ్రహ్మవేత్త, తన యొక్క ఆత్మ స్వరూపంలోనే ఎల్లప్పడు తాను ఉంటున్నప్పటికే అంతమాత్రరతో తృప్తి పొందకుండా, శిష్యులను ఉద్ధరించాలని, ఆశ్రమమదీ ఏర్పాటు చేసుకొని గ్రంథాలు వ్రాస్తూ, బోధలు చేస్తూ, కాలక్షేపం చేస్తూ ఉంటాడు ఒకానొక స్థితిలో ఇతడు దేశ పర్యటనం చేస్తూ గూడా తాను పొందిన జ్ఞానమును, అనుభూతిని, లోకులకు అందిస్తూ ఉంటాడు.

3. ఇక "ప్రీతుడనే" బ్రహ్మవేత్త వెలుపలివైన శబ్దస్పర్శాది దృశ్యాలతో పెద్దగా సంబంధం పెట్టుకోక తన శిష్యులను భక్తులను, ఉద్ధరించటానికే సంచరించు చుండగలడు. ఇతడు దృశ్య వర్గానికి అతీతుడై కేవల దృక్ స్వరూపుడుగా స్థిరుడై ఉంటాడు. గురుదీక్షలలో దృగ్దీక్ష అని, ఒక్కటి ఉన్నది ఈ మహనీయుడు తన దర్శన మాత్రము చేతనే, ఏ మాటా చెప్పకుండా, ప్రబోధా చేయకుండా శిష్యులను తరింపచేయగలడు అట్టివాని దీక్షను దృగ్దీక్ష అంటారు

4 "సమాహితుడునే" బ్రహ్మవేత్త తాను సర్వకాల సర్వావస్థల యందు బ్రహ్మ నిష్ఠుడై ఉండి కూడా, ధ్యాన (సంకల్ప) మాత్ర బలమువల్ల జగత్తును,

ఉద్ధరించకలడు ఇతనిది సంకల్పదీక్ష, లేక ధ్యాన దీక్ష అని చెప్పబడుతుంది. ఇలా సంకల్పమాత్రము చేత భక్త జనులను ఉద్ధరించటమనేది ఎంత అద్భుత కార్యమో ఆలోచించండి

5 ఇక "సత్కృతకాముడనే" మహాబ్రహ్మవేత్తకు, శబ్ద స్పర్శాది బహిర్వృశ్యముల పొత్తు కాని, సంకల్పవికల్పకామలోభాది అంతర్వృశ్యముల పొత్తు కాని, ఎంతమాత్రముండదు ఆతడొక్కమారు సంకల్పము చేసి- అంటే ఇలా జరగాలని భావన చేసి సమాధిలోకి వెళ్లితే చాలు ఆ సంకల్పం తగిన కాలములో ఫలించి జగత్కళ్యాణాన్ని సంపాదించి తీరుతుంది మనమెరిగినంతలో "పోతులూరి వీరబ్రహేంద్రస్వామి" ఈ తరగతికి చెందినవారే ఆయన ఏ విధమయిన లోకోద్ధరణను సంకల్పించి సమాధి స్థితుడయినాడో మనకు తెలియదు. అయినా ఆ మహనీయుడు నేటివరకు సమాధిలోనే ఉండి తన జగదోద్ధరణ దీక్షను కొనసాగిస్తునే ఉన్నాడని వేదాంతులు, యోగులు, భక్తులు శిష్యులు, ఆస్తికులు, భావిస్తున్నారు మరి కొందరు బ్రహ్మవేత్తలు ఏ కోరిక లేకుండా మరలా జన్మించి లోకాన్ని ఉద్ధరించాలనే సంకల్పం కూడా లేకుండా, ఆత్మముక్తికై సమాధి నిష్ఠులు కాగలరు. అట్టివారిలో మంత్రాలయము రాఘవేంద్రస్వామి పేర్కొనవచ్చు ఆయన ఆత్మముక్తి కోసం సమాధి అయిన్పట్టికీ సత్కృతోకాముడుగనుక తన్ను ఆశ్రయించి కొలచే భక్తులకు కోరికలు నెరవేరాలని దివ్య సంకల్పం చేసుకొని సమాధినిష్ఠుడై యుంటాడు. అందుకే ఆయనను కొలిచే భక్తుల వాంఛలు నెఱవేరుతూ ఉన్నవి.

ఇక మన రాజపాలెం అమ్మ పై అయిదు తరగతులలో ఏ తరగతికిచెందుతుందో మనము ఊహించుకోవచ్చు ఆమె బాల్యంలో చేసిన సాధన, మిక్కిలి తక్కువ సమయంలోనే ఫలించినట్లు మనకు అర్థమవుతూనే ఉన్నది ఆమెకు తాను ముక్తి పొందాలని కాని, ఇతరులను, మోక్ష కాములను చేయ్యవలెనని గాని గాఢ సంకల్పమున్నట్లు మనకెప్పడు చెప్పలేదు. అయినా, ఆమె బాల్యకాలంలో తల్లి మొదలగు కుటుంబసభ్యులతోను. ఇరుగు పొరుగులతోను, తన్నుచూడవచ్చిన వారితోను వ్యవహరించిన తీరును బట్టి ఆమెకు, ఏనాటికయినా సర్వమానవులూమోక్షమనే గమ్యాన్ని చేరాలనే సంకల్పమున్నట్లు మనం గ్రహించగలం సర్వులను సత్కార్యములకు ఆమె

చిన్న నాటి పలుకులే ఇందుకు నిదర్శనము కనుక ఆమె "సకృత్కాముల" తరగతికి కూడా చెందుతుందని అను కోవటానికికూడా వీలులేదు ఆమె సాక్షాత్తూ జగన్మాతృ, స్వరూపములో పరమాత్మస్థితిలో ఐక్యమై పోయినదని భావించుటకెట్టి సందేహమునూ లేదు కనుక ఆమె సాక్షాత్తు జగదీశ్వరీ స్వరూపిణియే ఇట్టి వారి పుట్టుక ఎంతో అరుదుగా కాని లోకమున జరుగుతుండదు మన మెరిగినంతలో గాని, చరిత్ర చెప్పినంతలోగాని, అన్న పానీయములను వర్జించి, ఇంతకాలము ఇట్లు యోగనిష్ఠులై ఉన్నవారిని కన్నామా! విన్నామా! ఒక్క ముమ్మడి వరం బాలయోగిని గూర్చి మాత్రమే విని ఉన్నాము వారిని కూడ సంవత్సరమునకొక సారి మాత్రమే ఏ కొందరో దర్శింపగలిగిరి. ఈమె స్థితి అట్టిది కాదు ఒకగట్టి ఇల్లు లేదు వాకిలిలేదు తాళములేదు దారినపోయే ప్రతివాడు వచ్చి దర్శించి పున్నెము సంపాదించుకొని పోవచ్చును ఆ వచ్చిన వాడు కానుకలర్పించవలసిన పనిలేదు టెంకాయలు కొట్ట వలసిన పనీలేదు ఆతని యిష్టం ప్రకారము ఆ ప్రదేశమును చూచి పోవచ్చును ఇన్ని విధముల ఈ రాజుపాలెం అమ్మ జీవిత చరిత్ర అత్యద్భుతము, అత్యపూర్వము అయి ప్రకాశించుచున్నది

# 4. అమ్మ వంటి కొందఱు యోగులు

సాధారణంగా బ్రహ్మవేత్తలైన వారి చరిత్రలు వారి, వారి, ప్రారబ్ధ కర్మలననుసరించి భిన్న రీతులుగా ఉంటవి ఒకరి సాధన ప్రకారము, ఇంకొక సాధన కూడా ఉండవలెననే నియమములేదు ఒకరు చెప్పిన మాటలే ఒకరు చేసినసాధనలే ఇంకొకరు చెయ్యవలెనని లేదు వారి వారి పూర్వజన్మ కర్మానుసారంగా వారివారి నడవడులు, సాధనలు ‘సంయోగవియోగాలు, సిద్ధులు, మహిమలు, ప్రవర్తిస్తూ ఉంటాయి మన అమ్మవలనే అత్యద్భుత మహిమలను చూపిన కొందరు బ్రహ్మజ్ఞలను గూర్చి ఇచ్చట ప్రస్తావించుకోవటం తత్త్వజ్ఞశువులకు ఎంతో లాభకారిగా ఉంటుంది

1) బెంగుళూరు నిర్మాణమ్మ : ఈమె బెంగుళూరులో ఒక విశ్వబ్రాహ్మణ కుటుంబానికి చెందిన గృహిణి తనకు దాదాపు 35 ఏండ్లు వచ్చేటంతవరకు ఒక ఉత్తమ ఆదర్శ గృహిణిగా భర్తతో సంసారం చేసింది ఆ దశలో

ఆమెకు హఠాత్తుగా ఏ సాధన చేయకుండానే పూర్వ
బ్రహ్మసాక్షాత్కారము అయినది అప్పటి నుండి ఆమె క
మార్పువచ్చినది కొంత కాలం గృహకార్యాలు నిర్వర్తిస్తూనే
బంధువులను ఆదరిస్తూ ఉండేది అట్టి సమయంలో
చొప్పన ఆమెను భర్త సంగమానిక పిలువగా, వద్దని నిషే
భర్త బలవంతముచేసినాడు అట్టి సమయంలో ఆమె గు
తీసుకువచ్చి తన ముందర ఉంచుకొని, చీరను పైకెత్తి
గడ్డి భగ్గున తగులబడి పోయినదట దానితో భర్తకు జ్ఞ
నుండి ఆమెనే తన గురు దేవతగా భావించి కొలువ
సంఘటనను గూర్చి మనమే మందుము! ఇట్టిది జర
శాస్త్రముగాని, ఏ పుస్తకము గాని చెప్పనే లేదు కనుక తత్త్వ
ఎవరివి ఏ రీతిగా ఉంటవో ఎవరు చెప్పగలరు. అవి
నిర్వాణమ్మ గారు బెంగుళూరులోనే జీవ సమాధి నిష్ఠురా
దివ్య సమాధిని ఈ గ్రంథకర్త స్వయంగా చూచి, ఆమెను
గూడా. ఈ వృత్తాంతం దాదాపు రెండు వందల ఏండ్లకు

2) గుంటూరు మస్తాన్ సాహెబు : పేరున
మహమ్మదీయుడని తెలుస్తూనే యున్నది కాని గుంటూరుక
నుండి వచ్చినాడో ఎవరికీ తెలియదు. ఆలుబిడ్డలు లేరు.
ఒక దున్నపోతు బండి మీద ఎక్కి కూర్చొని తిరుగుతూ
మాట కాని, బోధగాని లేనే లేదు ఒక ముతకగోనె
ఉండేవాడు మహాయోగీశ్వరుడు ఈయన తలను బొ
ఉంగరపు ఆకారంలో కూర్చొని ఉండేవాడు. తను మహా
భక్తులకు, కోరిన కోరికలు పండుతూ ఉండేవి. దాదాపు
ఏండ్లు అయినా జీవించి ఉంటాడు ప్రసిద్ధి. మా తా
మహనీయుణ్ణి బాగా ఎరుగుదురు గుంటూరులోనే సిద్ధి పొ
పేర ఏటేటా మస్తాను సాహెబు ఉరుసు అని ఉత్సవము జరు
ఆయనిది ఏ యోగమంటారు ఆయన హిందూ, మహమ్మ
బ్రాహ్మణాది వర్ణాలకు అతీయుడయిన పరిశుద్ధ మాన

పండించుకొని, అజరామరుడైన దేవోత్తముడు ఇలాంటి వారిః ఎంత నేర్చుకోవాలో ఎలా బాగుపడాలో ఆలోచించండి కూడా, ముందు పేర్కొన్న అయిదు తరగుతుల బ్రహ్మవేత్తలలో చెప్పగలం!

3) షిరిడి సాయిబాబా · వీరి చరిత్ర కూడా ఆంధ్రుల కాదు బ్రహ్మంగారి దేవాలయాలవలె, సాయిబాబా దేవా ఇప్పడిప్పడే దేశమంతటా వెలుస్తున్నాయి ఈ మహానుభా మహమ్మదీయుడో, ఇంకెవరో ఎవరికీ తెలియదు గదా! ప్రకృతిం పరాప్రకృతి లీలలను, పారమార్థిక రహస్యాలను, పిడికిటిలో పెట చేసే మహాత్ముడీ సాయిబాబా ఈయన బ్రహ్మంగారి ః అని అనేకుల ఊహ.

4) ఓం పరబ్రహ్మం : ఈ మహానుబావుడు చేబ్రోలులో ఉండే ఒక సామాన్యుడు. అయితే నేమి మః అష్టసిద్ధులను, అద్భుత లీలలను, ప్రదర్శిస్తూ భక్తుల కోర్కెలు తీర్చేవా ఏదయినా రోగం వస్తే ఆ రోగాన్ని కొన్నాళ్ల పాటు రాకుండ కుదిర్చేవాడు. ఆ వాయిదా తీరిన తరువాత మరలావారికి ఆ ఎవరికైయినా, తేలుగాని, పాముగాని, కుక్కగాని, కరిచి నీకు గాదు, ఆ గోడకు అనేవాడట వెంటనే గోడ నుం ఊడి పడేదట దానితో ఆ కరువబడిన వారి బాధ ఇలాంటి యోగ మహిమలను గూర్చి సిద్ధులను గూర్చి ఎ గలుగుతారు. ఇవన్నీ మేము నమ్మం, ఏవో కధలు అః నమ్మచెప్పగలరు

5) దొంతులమ్మ : ఈమె లంబాడీ కులానికి చె బందరులో ఉంటూ ఉండేది నూరేళ్ల నాడు మహాయో దీవిస్తే ఆ దీవెన ఫలించేది. ఎవరినైనా తిడితే ఆ తిట్టు అందుకని, అందరూ ఆ తల్లిని సేవించి పూజిస్తూ ఆమె ఆ ఎదురు చూస్తుండేవారు. బందరులోని రంగావధూత మొదలం

ఆమె అడుగులకు మడుగులు ఒత్తుతు ఉండేవారు ముతక పంచెగాని గోతాముచింపి గాని చాపచింపి గాని మొలకు చుట్టుకొని వికృతముగా వీధులలో తిరుగుతూ ఏ పంచనో, ఏ దేవాలయంలోనే అమ్మ కాలక్షేపం చేస్తూ సిద్ధి పొందిందట ఆ తరువాత కొంత కాలానికి భక్తులు, తలదాచుకొనుటకు వసతిగా చిన్న ఆశ్రమం వంటి దానిని ఏర్పాటు చేశారు

6) మడుగుస్వామి : ఈ మహానుభావుడు కాళహస్తి సమీపములోని ఏర్పేడు గ్రామము వద్ద రైల్వేరోడ్డునకు ప్రక్కనే ఒక నీటి మడుగులో తన దేహమును నడుముల వరకు నీళ్లలో పడవేసి, తలను ఒడ్డునపెట్టి నిరంతర బ్రహ్మనిష్ఠుడై ఉండేవాడు అందువల్లనే ఈయనకు "మడుగుస్వామి" అని పేరు వచ్చింది ఎల్లప్పడు తురీయ సమాధిలోనో, తురీయాతీత దశలోనో ఉండేవాడు. భక్తులెవరయినా వెళ్ళి స్వామీ, స్వామీ అనిపిలిస్తే లేపగా, లేపగా కొంతసేపటికి స్పృహలోనికి వచ్చేవారు. మనమేమాట అంటే దాన్నేతానూ అనేవాడు కాని, సమాధానం చెప్పేవాడుకాదు అంటే బాహ్యప్రపంచ స్పృహ ఎంతమాత్రమూ అతనికి ఉండేది కాదన్నమాట. ఇలాంటి వారినే "బ్రహ్మవిద్వరిష్ఠు"లని కట్టకడపటి తరగతి బ్రహ్మభూతులునుగా వేదాంత శాస్త్రం పేర్కొన్నది ఈ గ్రంథకర్త 1937వ సంవత్సరములో ఈ మహనీయుని దర్శించి, సేవించి ఒక అరటి పండును సగం మాత్రం తినిపించి తదనుగ్రహానికి పాతుడయినాడు

7) కురుమద్దాల పిచ్చమ్మ : ఈమె ఒకహరిజన స్త్రీ కొంతకాలము గృహస్థాశ్రమాన్ని నిర్వహించిన తరువాత ఒక కుటుంబ సంఘటన కారణంగా బ్రహ్మత్వ సిద్ధిని పొందినది అచిరకాలంలోనే, అఖండ బ్రహ్మనిష్ఠురాలై, లోకులదృష్టిని ఆకట్టుకొని, ఎందరినో శిష్యులుగా చేర్చుకొని కడతేర్చినది శ్రీమిత్యానందస్వామి, పెకేండ్లు, ఈమెను అంటి పెట్టుకొని ఉన్నారు ఈమె భాష వివరణను అపేక్షిస్తూ ఉండేది. స్వామి ఆమె సైగలను, భాషను వివరించి భక్తులకు తెలియ చెపుతూ ఉండేవారు. ఒకసారి, గాంధీ గారితో గూడా, ఈమెకు సమావేశ పరచి, ఈ తల్లి బ్రహ్మజ్ఞానమును, ప్రవర్తనను గూర్చి ఆయనకు పరిచయము చేసినాడు. కురుమద్దాలలో ఈమె గారి ఆశ్రమముకలదు. ఇట్టి వారందరు. ప్రారబ్ధానుసారముగా గృహస్థులై ఉండి, అది తీరగానే బ్రహ్మ, వేత్తలై, లోకమును ఉద్ధరించడానికి పాటుబడిన మహాత్ములే అనటానికి ఎట్టి సందేహము లేదు.

8) చిన్నమ్మ : ఈమె రేపల్లె తాలూకా గొరిగపూడి గ్రామ నివాసిని ఈమె సామాన్య సంసారినిగానే యుండి సంతానమును కని కొంతకాలానికి బ్రహ్మజ్ఞాన సంపన్నురాలైనది. ఆమె పూర్వజన్మ పుణ్యము అద్భుతంగా వికసించి ఏ శాస్త్రాలు చదవకుండానే, ఏ గురువులను సేవించకుండానే ఆమెకు అఖండ బ్రహ్మసాక్షాత్కార మయినది. దాంతో కుటుంబ పరిత్యాగం చేసి యోగినిగా జీవించటం ప్రారంభించినది ఆమెకు తనయొక్క పూర్వజన్మ జ్ఞానమేకాక, ఇతరుల యొక్క పూర్వజన్మ జ్ఞానం కూడా ఉన్నదని ఈ గ్రంధకర్త భావిస్తున్నాడు శ్రీ తత్వానందస్వాములవారు తన చరమ జీవితమును ఈమె వద్దనే రేపల్లెలోని ఆశ్రమములో అత్యద్భుతంగా గడిపినారు ఆ తల్లికి కడుపున కనని బిడ్డడై ఆమె చర్యలను వివరణచేస్తూ యోగంలో అతీతభూమికలను మెట్టి ధన్యుడయినాడు. ఆయన సిద్ధి పొందినది కూడా ఆ ఆశ్రమములోని ఆ తల్లి చెంగటనే తత్వానందస్వామిని జలసమాధి చేసిన వారిలో ఈ గ్రంధకర్త స్వయముగా పాల్గొన్నాడు ఇటువంటి మహిమ కలదే పెద్దమ్మ అనే పేరుగల మరోక బ్రహ్మజ్ఞురాలు ఆమె చరిత్ర గూడా అద్భుత మయినదే. చిన్నమ్మ పెద్దమ్మ లిద్దరుకు దగ్గరి చుట్టరికం ఉన్నది. "పెద్దమ్మ" గారు కూడా గొరికపూడి గ్రామ నివాసియె ఈమె గూడ చిన్నమ్మగారి వలెనే సంసార జీవితము గడిపి, బిడ్డలనుకని, తరువాత ఆశ్రమవాసినియై బ్రహ్మజ్ఞాన సంపన్నురాలైనది

ఈమె గూడ రేపెల్లె లోనే చిన్నమ్మ గారి ఆశ్రమమునకు ఎదురుగానే 'బావాజీ' అను తోటలో ఒక కుటీరములో ఉంటూ, శరీరమునకు గోనె పట్టాను చుట్టుకొని వచ్చే పోయే బాటసారులకు, తన్నాశ్రయించిన వారికి సేవలు చేస్తూ ఉండేది ఈమెకు బ్రహ్మజ్ఞానాన్ని పొందిన ఒక గొప్ప మహనీయురాలు వీరిద్దరు కాపుకులమునకు చెందినవారు బ్రహ్మజ్ఞానానికి కులంతో నిమిత్తంలేదని సద్గుణాలు, సత్కర్మలు, సత్సాధనలే మూలమని ఇందువల్ల తెలుస్తుంది గదా! బ్రహ్మణుడుగా పుట్టి మహా పండితుడు, మహాకవి అయికూడా, వర్ణబేధాన్ని పాటించినందువల్ల శంకరుడు ముక్తికి దూరంకావలసి వచ్చినది అందుకే సర్వసమభావంతో బ్రహ్మజ్ఞాని అయిన వాడు ఛండాలుడైనా 'నాకు గురువే' అని అంటేగాని, ఆయనకు మోక్షము సిద్ధించలేదుగదా! (చండాలోస్తు, సతుద్విజోస్తు, గురురిత్యేషా మనీషా మమ).

ఇలాంటి మహనీయులు, అమ్మను పోలిన వారునూ ఎందరో ఉన్నారు మన ఆంధ్ర దేశంలోనే కాదు తమిళ, కర్ణాటక, వంగ, మహారాష్ట్రాది దేశాల్లో కూడా ఇలాంటి మహాత్ములకు నాటికీ, నేటికీ కొదవ లేదు

తత్త్వానందస్వామి - పూర్వాశ్రమములో వీరి అసలు నామధేయము కొండపర్తి వీరభద్రాచార్యులుగారు. వీరు బందరు నివాసి ఆ కాలములోనే బి.ఎ పట్టభద్రులు అయినారు వీరు కొంతకాలము బందరు నోబుల్ కాలేజిలోను, కృష్ణాజిల్లా నందిగామ హైస్కూలులోను, తెనాలి తాలూకా హైస్కూలులోను ఉపాధ్యాయులుగా పనిచేసి, చివరకు "గోరికపూడి" గ్రామమునకు సమీపములో ఉన్న 'ఓలేరు' అను గ్రామములో ఆ గ్రామ ప్రజల కోరికపై "శ్రీ కృషి విద్యాలయ హిందూ హయ్యర్ ఎలిమెంటరీ" పాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగా పనిచేశారు. అక్కడే వీరికి భార్యావియోగం కలిగినది తరువాత వారి కుటుంబము "గోరికపూడి' గ్రామము వచ్చి, ఆ గ్రామములో పెద్ద భూస్వామి అయినటువంటి దేవినేని బసవయ్యగారి పిల్లలకు చదువుచెప్పచూ కొంతకాలము అక్కడ గడిపి ఆ తరువాతే అక్కడే సంన్యాసము స్వీకరించి, ప్రథమ బిక్షను తన తల్లి గారైన కామాక్షమ్మగారి వద్ద తీసుకొని దేశాటనము చేస్తూ కొల్లూరు గ్రామసమీపములో వున్న 'బొద్దులూరుపాడు' గ్రామములోను రేపల్లె తాలూకా 'గూడవల్లి' గ్రామములోను ఆశ్రమములు స్థాపించి శిష్యులకు తత్త్వజ్ఞానాన్ని బోధిస్తూ ఉంటూ చివరకు రేపల్లెలో ఉన్న 'చిన్నమ్మ'గారి వద్దనే చేరి తనువు చాలించారు

కోసూరి వెంకటసుబ్బారావుగారి జన్మస్థానముగూడ 'గొరిగపూడి' గ్రామమే వీరితండ్రి లక్షయ్యగారు, తల్లి శ్యామలాంబ, వీరిది అతిథిసత్కారములు గావించి, దానధర్మములు చేసిన సంపన్న కుటుంబము వీరభద్రాచార్యులు గారు సంన్యాసము స్వీకరించిన తరువాత వారికుటుంబసభ్యులు 'గొరికపూడి' లో కోసూరి లక్ష్మయ్యగారి ఇంటి ప్రక్కనే ఉండేవారు వారి కుటుంబ మంచి చెడులు లక్ష్మయ్యగారే చూస్తూ ఉండేవారు. ఆ విధంగా ఈ రెండు కుటుంబములకు దగ్గర సంబంధము ఏర్పడినది.

# 5. కొన్ని యోగరహస్యాలు

ఏ యోగ విధానంలో నయినా, శరీరం, ప్రాణం, ఇంద్రియాలు, మనస్సు, ఆత్మ (జీవుడు) అనేవి ప్రధానాలు శరీరము అనగానే చర్మం, రక్తం, మాంసం, ఎముకలు, మద్య, మేధస్సు, శుక్రము, అనే ధాతువులు సమూహమని మనకు తెలుసు శరీరం తరువాత కన్ను, ముక్కు,చెవి, చర్మము నాలుక అనే ఇంద్రియాలు లెక్కకు వస్తాయి ఇవి శబ్ద, స్పర్శ, రూప, రస గంధాలను గ్రహిస్తాయి గనుక జ్ఞానేంద్రియాలన్నారు ఇవి పంచభూతముల యొక్క సత్వగుణాంశల చేత వ్యష్టిగా సృష్టింపబడతాయి తరువాత వాక్కు, పాణి, (చేయి) పాదము, ఉపస్థ, పాయువు అనేవి కర్మేంద్రియాలు ఈ కర్మేంద్రియాలు, వచన, ఆదాన, గమన, విసర్జన, ఆనందములనే పనులను జరుపుతాయి ఇవేమో పంచభూతముల యొక్క రజో గుణాంశల వల్ల వ్యష్టిగా సృష్టింపబడుతవి. ఇప్పడు చెప్పకున్న దశేంద్రియాలు స్థూల శరీరములో అగుపడే కన్ను, ముక్కు, కాలూ, చేతులే కావు ఇవి ఇంద్రియగోళాలు మాత్రమే. వీటికి మూలములయిన ఇంద్రియాలు సూక్ష్మాతి సూక్ష్మాలయి సూక్ష్మశరీరాన్ని అంటి పెట్టుకొని వుంటాయి

తరువాత చెప్పదగినవి పంచ ప్రాణాలు ఈ ప్రాణశక్తులు, గుండెలో ప్రాణము, గుదస్థానమున అపానము, నాభి వద్ద సమానము, కంఠ దేశములలో ఉదానము, దేహమంతా వ్యాపించి సమానము ఉండి వాటి వాటి పనులను నిర్వర్తిస్తూ ఉంటాయి ఈ పంచ ప్రాణాలు పంచభూతముల యొక్క రజోగుణాంశముల సమష్టి సృష్టి ఇవి కూడా సూక్ష్మ శరీరమును అంటి పట్టుకొని ఉండేవే. ఈ పంచ ప్రాణాలకు తరువాత ప్రముఖ స్థానము వహించేది అంత:కరణము. ఇది సాత్విక, పంచ భూతముల యొక్క సమష్టి సృష్టి అందుకనే కంటి ద్వారా రూపాన్ని, చెవి ద్వారా శబ్ధమును, ముక్కు ద్వారా గంధమును, నాలుకతో రుచులను, చర్మముతో స్పర్శలను గ్రహించగలుగుతున్నది ఈ అంత:కరణానికి మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అని నాలుగు వృత్తులు. ఈ సమష్టినే "అంత:కరణ చతుష్టయం" అంటారు ఈ చెప్పకున్న వాటికన్నిటికీ వేరై వెలుగుతూ ఉండదే ఆత్మ లేక జీవుడు. ఇది చైతన్యకు వెలుగే స్వరూపంగా కలిగినటువంటిది.

ఈ జీవునికే అంత:కరణష్టయం కాని, దశేంద్రియాలు కాని, పంచప్రాణాలు కాని సాధనాలు కర్త అయిన జీవుడు తన జ్ఞాన కర్మేంద్రియాలను, పంచ ప్రాణాలను, అంత:కరణాన్ని, పరిశుద్ధం చేసుకుంటూ పోవడానికే యోగాభ్యాసం అవసరం, యమ నియమాసనాదుల అభ్యాసం వల్ల శరీరేంద్రియాదులు పరిశుద్ధములవుతవి సత్యం వల్ల వాక్కు పరిశుద్ధమవుతుంది. మంత్ర జపాదుల వల్ల, సచ్చింతన వల్ల అంత:కరణము పరిశుద్ధమవుతుంది. మన అమ్మ పూర్వజన్మలోనే ఈ ఇంద్రియ గణము యొక్క పారిశుధ్యాన్ని పూర్తిగా పొంది ఈ జన్మకు వచ్చింది

ప్రాణం పరిశుద్ధం కావటానికీ, అది మనకు వశపడటానికీ, ప్రాణాయామ కార్యం అవసరం. ఈ ప్రాణాయామం రేచక, పూరక, కుంభకాలనే పేర్లతో ఒప్పతుందని, శాస్త్రాలు, గురువులు చెప్పతున్నారు. ఈ మూడు రకాలయిన ప్రాణాయామాలలో కుంభక ప్రాణయామము, చాలా గొప్పది కుంభక ప్రాణాయామంలో భ్రూమధ్యస్థానానికి లేదా ఆజ్ఞా చక్రానికి, ఎక్కువ ప్రాధాన్యముంటుంది ఏమన షట్చక్రాలలోనూ, ఆజ్ఞా చక్రము జీవునికి స్థానమయినదీ, అంత:కరణానికి నివాసమయినదీ కావడమే అందుకు హేతువు. భ్రూమధ్య స్థానములో ఇడా పింగళా నాడలే కాక "సుషుమ్న"అనే పేరుగల బ్రహ్మనాడి కూడా అంతర్నిగూడమయి ఉన్నది ఈ మూడు నాడులకు భ్రూమధ్యం సంగమస్థానం. అందుకే దాన్ని త్రికూటమని కూడా అన్నారు. ప్రతి యోగసాధకుడూ, ఈ ఆజ్ఞా చక్రం మీద చేయవలసిన సాధన ఎంతో వున్నది సుషుమ్న అనేది ఆధారం నుండి బయలుదేరునటువంటిది. గుండెలు దానికి ఒక మజలీకాగా, భ్రూమధ్యం రెండంవ మజలీ. కడపటిదైన సహస్రారం గమ్యస్థానం లేక పరమ విశ్రాంతి ప్రదేశం అనవచ్చు.

ఇంతవరకూ వచ్చేటప్పటికి ప్రాణాయామంలో సాధకునికి వాయువశం చేకూరి ప్రాణజయాన్ని పొందగలుగుతాడు. అతడాప్రాణాన్ని సుషుమ్నలో ప్రవేశపెట్టడం ఈ భ్రూమధ్యంలోనే నేర్పవలసివున్నది ఈ సందర్భంలో ప్రాణశక్తి వేరు, స్థూలమయిన గాలి వేరు అని పాఠకులు, సాధకులు గమనించ వలసియున్నది ముక్కులో సంచరించే గాలి స్థూలమయినదే. దానికి చలనాన్ని ప్రసాదించేదే ప్రాణశక్తి. అంటే ఈ ప్రాణము ఎక్కడదని అంటారేమో. అది

సూక్ష్మ శరీరగతమై వున్న పంచ ప్రాణములలోనిదని తెలుసుకోవాలి. ఆ ప్రాణశక్తికి, ఈ స్థూలవాయువునకు పొత్తు కలిగితేనే కాని, జీవుడు శరీరంలో ఉండటం సంభవించదు ఈ సందర్భములో మన డాక్టర్లు శరీరంలో ప్రవేశపెట్టే ప్రాణ వాయువు (oxygen) అని మరచిపోకూడదు. రాజుపాలెం అమ్మ ఈ ప్రాణశక్తిని, సుషుమ్నలో సంచరింపచేసే యోగమును ఈ జన్మలోనే నేర్చి సిద్ధి పొందినదని ఆమె యోగ విధానాన్ని బాల్యం నుండే గమనిస్తున్న మాకు తోస్తున్నది

ప్రాణశక్తికి, అంతర్నాడీ ప్రవేశము జరిగిన తరువాత వారి అంతఃకరణం అత్యంత నిశ్చలము, అతి నిర్మలము అవుతుంది దాని కప్పడు బాహ్య విషయాల మీద ప్రీతి తగ్గిపోతుంది ఆత్మదర్శనం కావటం వల్ల ఏదో ఒకానొక అనిర్వచనీయ ఆనందాన్ని తృప్తిని, వారు అనుభవిస్తారు ఈ అనుభూతి రాజుపాలెం అమ్మగారికి గుంటూరులో ఉండగానే కలిగిందని తోస్తున్నది. సూక్ష్మంగా ఆలోచిస్తే ఆమె విద్యార్థినిగా వున్నప్పుడు రాజుపాలెం దగ్గరి చిట్టడివిలోని చెట్టు క్రింద కూర్చొన్నప్పుడే ఆమెకు ఆ సిద్ధి ప్రారంభమయి ఉంటుందనడానికి నిశ్చలమయిన ఆమె విషయాతీత స్థితియే నిదర్శనం.

ఈ సాధన బలపడుతూ ఉన్నప్పటి ఆమె చర్యలను మేము గమనించుట మైనది. ఆమె ఆ దశలో నాలుగైదు రోజులకొకసారి మాత్రమే సమాధి నుండి ఈవలకు వచ్చి స్నానాదులు చేసి మరల సమాధి దశకు పోతూఉండేది ఆమె వెలుపలకు వచ్చినప్పటికీ తన అంతరాహ్వానానికి లోనైపోయి ఎప్పుడెప్పుడు తాను అనుభవించిన సమాధిలోకి పోదామా అనే తహ తహ పడుతూ ఉండేది. ఆ తహతహలలో ఆమెకు, అన్న పానీయములు కానీ, కానీ, తలిదండ్రులకాని, ప్రపంచంకాని, ఏ విషయాలు, పట్టేవికావు తనకు దొరికిన తత్త్వమార్గంలో ఎప్పుడు తన హృదయాధినాధునిలో కలసిపోదామా అని ఆ సహస్రార ప్రయాణం కోసమై వెదకులాడుతూ వుంటూ వుండేది

ప్రతిదినమేకాదు క్షణ క్షణానికి, ఆతల్లి ప్రాపంచిక బంధాలు, తెగిపోతూవుండేవి. వాటి మీద ఆమెకు ఆసక్తి లేశ మాత్రమయినా ఉండేది కాదు. ఆ రోజులలో ఆ తల్లి పొందిన, పొందుతున్న ఉత్తమోత్తమస్థితిని గూర్చి వివరంగా వ్రాయాలంటే ఇది చాలా పెద్ద గ్రంధమవుతుంది. వ్యాఖ్యానోపాఖ్యానాలతో ఆవర్ణనంలో ఇక్కడ చేయదలంచలేదు

# 6. భ్రూ మధ్య స్థాన ప్రాధాన్యము

కుండలినీ యోగ విధానాన్ని అనుసరించి చూచినట్లయితే 1 ఆధారం, 2 స్వాధిష్ఠానం 3 మణిపూరం 4 అనాహతం 5 విశుద్ధం 6 ఆజ్ఞ 7 సహస్రారం - అనే ఏడుచక్రాలలో ఒక దానికంటె నొకటి అధిక ప్రాధాన్యం కలవి అవుతాయి ఆధారమునుండి విశుద్ధము వరకు కల అయిదు చక్రాలకు వరుసగా పృథివ్యాది పంచభూతాలతో సంబంధమున్నది అవిచేసే పనులు కూడా, ఆ భూతాలకు సంబంధించే వుంటాయి. పృథివీ భూత ప్రధానమైన ఆధార చక్రము మీద నిద్రిస్తున్న కుండలనీ శక్తిని యోగసాధకుడు మేలుకొలిపి, ఊర్ధ్వప్రయాణం చేయించటంతో కుండలినీ యోగం ప్రారంభమగుచున్నది. ఈకుండలినీ శక్తిని అనుసరించియే సాధనకుడి మనస్సు కూడా ప్రయాణం చేయవలసి ఉంటుంది మనస్సు యొక్క తోడ్పాటు లేకపోతే కుండలినీ శక్తి నిరాశ్రయమే అవుతుంది కాబట్టి అది మనోరహితంగా ప్రయాణం చేయలేదు సాధకులు ఆధారకమలంతో సూక్ష్మంగానే కాక, సూక్ష్మాతిసూక్ష్మంగా భావరూపమయిఉన్న కుండలినీశక్తికి మనస్సుతో పొత్తు కూర్చుకోవాలి ఇక్కడ అంత కరణం కుండలినిని ఆశ్రయించడం కుండలిని అంత కరణాన్ని ఆశ్రయించడం అనే రెండు కార్యాల యొక్క అన్యోన్యసహకారం ఈ యోగంలో మిక్కిలి అవసరం.

కుండలినీ అనేది మాయాస్వరూపిణిగాను, ప్రత్యేక పరమాత్మల ఆకారంగాను, వివధావతారాలతో లీలామాత్రంగా సాధకులకు తోస్తుందేకాని, స్వస్వరూపంతో సాక్షాత్కరించదు సద్గురుని కటాక్షంతో ఎంతో మెలకువగా ఈ శక్తిని మేలుకొలిపి పైకిపంపవలసియున్నది. తీవ్రతర ప్రాణాయామము వల్ల అందులోనూ కేవల కుంభకమువల్ల కుండలిని మేలుకొనడం ఒక మార్గం అది సులభం కూడాను ఇలాంటి ఈ శక్తి ఆధారం నుండి బయలుదేరి ఒక్కొక్క చక్రాన్ని ఛేదించుకుంటూ సహస్రారానికి ప్రయాణం చేయాలి ఈ సంగతినే బ్రహ్మంగారు "కుండలినిటు ఛేదించీ, అఖండముగను భావించి" అన్నారు.

ఎడతెగకుండా గాఢంగా అభ్యాసం చేస్తేనే కాని కుండలిని యొక్క

ఈ ఊర్ధ్వ ప్రయాణం సాగదు కొందరికి ఇది అంతా అగమ్యంగాను, అంతుపట్టనిదిగాను, కల్పనగాను, అబద్ధంగాను గూడా తోచవచ్చు! ఇందుకు కారణం ఈ కుండలిని శక్తి యొక్క స్వరూపము, దాన్ని మేలుకొలపటమూ, ప్రయాణింపచేయటమూ అనే కార్యాలు ఎంతో లోతైనవి, సుకుమారమైనవి, అనన్య సాధ్యాలయినవీ కావటమే అయినా ఇలాంటి యోగీశ్వరులు అరుదుగానైనా ఉండటమువల్ల దాన్ని ఎవరూ కాదనడానికి వీలులేక పోయినవి. ఎవరయినా దీన్ని నమ్మలేకపోవటానికి మాయాశక్తి విమోహమే హేతువు. అందుకే దక్షణామూర్తి స్తోత్రములో "మాయాశక్తి విమోహ కల్పిత మహావ్యామోహ సంహారిణే" అని అన్నారు శంకరులు.

ఇలాంటి కుండలిని ప్రభోదాన్ని "అమ్మ" తన పూర్వ జన్మల్లోనే పొంది యోగ భ్రష్టురాలైనట్లు మన ఊహలకు అందుతున్నది ఈ జన్మలో ఆమె చేసిన పని ఆ కుండలిని చక్రాలను ఛేదించుకుంటూ ఆజ్ఞ దాకాను, ఆవల సహస్రారం దాకాను పంపటమే. ఈ ప్రయాణంలో జరిగే విలాసాన్నే అమ్మ గుంటూరులోనూ, పిమ్మట రాజుపాలెంలో నేటి వరకు వున్నప్పుడు జరిగినట్లుగా మనం గమనించవలసి వున్నది.

ఆజ్ఞాచక్రానికి భ్రూమధ్య స్థానమే నివాసం గనుక భ్రూ మధ్యము యొక్క ప్రాముఖ్యమును సాధకులు మిక్కిలిగా గమనించ వలసియున్నది ఈ భ్రూమధ్యాన్ని త్రికూటమని కూడా వేదాంతులు చెపుతూ వుంటారు అంటే మూటి యొక్క కూటమి గలిగిన స్థానమన్నమాట ఇది రెండు కన్నులకు నడుమ వుండే స్థానము కదా! అంటే మూడవకన్ను ఉండే చోటు అన్నమాట ఆవలి, ఈవలి రెండు కన్నులకు సూర్యచంద్రులధిపతులు నడిమిదైన మూడవ కన్ను అగ్నిమయం ఇందుకు పరమేశ్వరుణ్ణే మనవారు దృష్టాంతంగా చూపదలచి, ఆయనను అగ్ని నేత్రుని, ఫాలలోచనుని చేసినారు

ఆయనలాగ యోగమును పండించుకున్న ప్రతివాడూ, త్రినేత్రుడు కావటానికి వీలున్నదని ఇక్కడ గ్రహింపదగిన రహస్యం.

ఈ భ్రూమధ్యస్థానంలోని ఆజ్ఞాచక్రమే జీవుడు విహరించే హృదయం. అంత:కరణానికిదే నివాసం. ఇక్కడి అంత.కరణమును, కారణదేహమనీ అనాది

అజ్ఞాన మనీ ఎన్నవలసి వున్నది దీని యందే అవ్యక్తము (మూలప్రకృతి) మహత్తు, అహంకారము, త్రిభూతములు, నివశించి తమ సమిష్టి రూపంలో పరమాత్మ ప్రతిబింబాన్ని ప్రతిఫలింపచేసుకొని జీవుడని వ్యవహరింప బడుతుంది కాగా ఇది చిదాభాసునికి, వాడి కధిష్ఠానమైన కూటస్థునికి, చిదాభాసుని ప్రతిబింబంప చేసుకొన్న అంతకరణోపాసునికి నెలవన్నమాట. అకారణం వల్లకూడా భ్రూమధ్యాన్ని త్రికూటమని అనవచ్చు జీవుడిక్కడ నుండే జాగ్రత్తులోని వ్యవహారాలు కొనసాగిస్తూ వుంటాడు ఈ జీవుఉడు విశుద్ధ చక్రానికి వచ్చినప్పుడు స్వప్నావస్థను, అనాహతాన్ని చేరుకున్నపుడు గాఢ నిద్రను, పొందుతాడు ఇదంతా యోగిస్వానుభవం చేత తెలుసుకో గలగుతాడు. ఈ భ్రూమధ్యంలో ఇడా పింగళలు, సుషుమ్న కలుసుకుంటాయి. అందుచేత గూడా ఇది త్రికూటం ఈ ఇడా పింగళా సుషుమ్నలను గంగా, యమున, సరస్వతులని కూడా మనవారు భావించారు ప్రయాగ క్షేత్రంలో గంగా, యమునలు మాత్రమే అగపడి, సరస్వతి అంతర్వాహిని అయి అగుపడనట్లు, ఇక్కడకూడా పైకి ఇడా, సింగళలె పనిచేస్తూ వుంటాయికాని, నిగూఢంగా లోపల వున్న సుషుమ్న గోచరించదు అందుకే దాన్ని అంతర్నాడి అన్నారు కుండలినీయోగి ఈ అంతర్నాడిలో తన స్థూల వాయువును, ప్రాణశక్తిని, సంచరింప చేయగలుగుతాడు. ఆ స్థితిలోకుండలినీ శక్తి బ్రహ్మ రంధ్రానికి (సహస్రారానికి) ప్రయాణం చేయగలుతుంది ఈ విషయాన్నే "అంతర్నాడీ నియమిత మరుల్లంఘిత బ్రహ్మరంధ్రం" అన్నారు యోగులు. రాజుపాలెం అమ్మ ఈ స్థితిని గుంటూరులో ఉన్నప్పటి నుండి సాధించ మొదలు పెట్టి రాజుపాలెం వెళ్లిన పిమ్మట పరాకాష్టను, సిద్ధిని పొందినట్లు మనం గమనించగలం

కుండలినిశక్తి భ్రూమధ్యంలోని ఆజ్ఞాచక్రాన్ని చేరుకొనేటప్పటికి, జీవుడు ద్రష్ట అయి, సాధన సమయంలో అంతకరణోపాధిని చూడగలుగుతాడు అట్లా చూడడానికి ఆరంభించి తన సచ్చిదానంద స్వరూపానికంటె వేరై దృశ్య రూపంగా ఏ వస్తువు తోస్తున్నదో అది తనకంటె భిన్నమైన ప్రకృతి స్వరూపమని దాని యందే తాను ప్రతిబింబ రూపాన్ని దాల్చి 'నేను' అనుకుంటూ 'జీవుడను' అనుకొంటూ వ్యవహరిస్తున్నాడని భావించ గలుగుతాడు ఆ స్థితిలో తన కారణోపాధిని తనకంటె వేరుగా, దృశ్యంగా

చూచుకొనే అభ్యాసం ధృఢమైనకొలదీ తాను దృక్ అనే భావం అతనికి దృఢ పడుతూ ఉంటుంది తాను దృక్ అనే భావం తోచినప్పుడు తనకంటె భిన్నమైనది దృశ్యం కాక తప్పదు కదా! ఇక్కడ ఈ రహస్యాన్ని సాధకులు తప్పక గుర్తించుకోవలసి వున్నది జాగ్రదవస్థలో తనకంటె భిన్నమైన స్థూలదేహం దృశ్యమై, తనచేత చూడ బడ్డది. అట్లాగే స్వప్న కాలంలో, స్వప్నదేహం కంటే, స్వప్న జగత్తుకంటే తానువేరై సమాధి దశలో గూడా దృశ్యమైన కారణదేహాన్ని తానైన సాక్షి చూస్తునే వున్నాడు. ఈ అనుభూతిని సాధకులు జాగ్రత్తగా గమనించవలసి ఉన్నది

అసలు జీవ విద్యలనండి, ఆత్మ, అహంకారం అనండి, ఇవి పరస్పరం భిన్నాలయినా, ఒక దానితో ఇంకొకటి తాదాత్మ్యాన్ని పొంది వుంటాయి ఎలాగంటే ఇనుపగుండును నిప్పలో కాల్చినప్పడు నిప్ప ఆ ఇనుపగుండు నంతా వ్యాపించే ఉంటుంది అప్పడు నిప్పధర్మాలయిన కాంతి, వేడి, అనేవి ఇనుపగుండుకు సంక్రమిస్తాయి. ఇనుపగుండు ధర్మాలయిన గుండ్రతనం, పొట్టి, పొడుగులు అగ్నికి సంక్రమిస్తాయి

అలాగే కారణోపాధి యందు ఆత్మచైతన్యం ప్రతిబింబించినప్పడు గూడ ఆత్మయొక్క చైతన్యం కారణోపాధికి, ఉపాధి యొక్క త్రిగుణాలూ, అహంకార మమకారాలు, మొదలైన ధర్మాలు ఆత్మకు కలుగుతాయి ఉపాధి గుణాలు ఆత్మకు కలిగి నందువలే ఆత్మ జీవుడవుతున్నాడు. ప్రకృతి, జీవుని బంధించుట మంటే అదే. తన ధర్మాలను ఆత్మ మీద వేసి రుద్ది, దానిని ప్రకృతికి దాసునిగా చేస్తుంది దానితో అతడు సుఖ, దు:ఖ, సంతాపాదులకు లోనై నేను సంసారిని అని ఏడుస్తూ, చస్తూ, పుడుతూ వుంటాడు ఇలాంటి, ప్రకృతి బంధాల నుండి వీడ్పాటు చెందడమే ముక్తి అంటే

భ్రూమధ్యస్థానంలోని ఆజ్ఞా చక్రంలో కుండలినీయోగి సాధన పరిపక్వమయ్యేటప్పటికి, అతని కర్మబంధాలు పటాపంచలయి పోతాయి దృశ్యరూపంగా వున్న మూలప్రకృతి (కారణదేహం) తనలో కరిగిపోతుంది ఏ అల అయితే సముద్రంలో నుండే పుట్టిందో, ఆ అల అ సముద్రములోనే లయిస్తుంది గదా! అలాగే, సంసారాన్ని సృష్టించిన దృశ్యజగత్తు, దృక్ స్వరూప పరబ్రహ్మంలో లీనం కావటమే బంధ ముక్తి అంటే ఈ స్థితిలో సహస్రారస్థ

పరమాత్మ, భ్రూమధ్య స్థిత ప్రత్యగాత్మ రెండూ ఏకమయి పోతాయి ఇక్కడ ఏకమౌతాయి అన్నమాటకు కూడా అర్థంలేదు మనం భిన్నం అనుకుంటున్నాం గనుక ఏకమనే పదం ప్రయోగించాల్సి వచ్చింది భిన్నమనుకోవటం వ్యవహారికంకాగా, ఏకమను కోవటం పారమార్థికం

మన రాజుపాలెం అమ్మ ఈ స్థితికి చేరుకొన్నది అందుకనే బాహ్య జగత్తు యొక్క స్పర్శ ఆమెకేమాత్రం సంభవించటంలేదు అయితే ఆమె ఇలా ఎంతకాలం వుంటుంది భవిష్యత్తులో ఆమెస్థితి ఏమిటి? అనే ప్రశ్నలు ప్రతివారికి సహజంగా కలుగుతాయి పూర్వగ్రంధంలో యోగవాసిష్ఠ వృత్తాంతాన్ని మనం చదివే వున్నాము. ఆ రాజులాగా, ఆ బ్రహ్మంగారిలాగ ఆమె చిరకాలం సమాధి నిష్ఠురాలై వున్నా వుండవచ్చు. ఉపాధిని వీడి అఖండ బ్రహ్మపదార్థం అయినా కావచ్చు. ఇలా సమాధి నిష్ఠులయిన కొందరు, ప్రారబ్ధ కర్మ శేషం తీరగానే పతనం కావటం అసంభావ్యమేమి కాదు గనుక ఈ తల్లి భవిష్యత్తును గూర్చి ఇదమిదమని చెప్పటానికి మన శక్తి చాలదు ఇంతవరకూ చేసిన మన ఊహల ప్రకారం అమ్మ అవలబించినది కుండలినీ యోగమని ముప్పాతిక భాగం చెప్పవచ్చు కాని అదే కాకుండా దానికి మించిన ఇంకేదయినా అతీత మార్గం కావటానకి గూడా అవకాశాలు లేకపోలేదు. ఆమార్గాలలో సంచరించిన వారికిగాని అవి తెలియవు మన బుద్ధికి, మన జ్ఞానానికీ మన అనుభవానికే శాస్త్రానికీ అందినంత వరకూ అమ్మను గూర్చి ఒక అంచనామాత్రమే ఇంతవరకూ వ్రాసిన గ్రంధము

ఈ సందర్భంలో ఒక విషయాన్ని మనం స్మరించితీరాలి కుండలినీ యోగాన్ని పూర్తిగా ఆచరించి ఫలితాలను పొందిన వారిలో 'గోరక్షనాధుడు' మొదలైన నాధ సంప్రాదాయానికి చెందిన యోగులు మనకు గ్రంధాల ద్వారా వినబడుతున్నారు. పిమ్మట పండరీ భక్తులలో "సంత్‌జ్ఞానదేవులు" గొప్పవారు ఆయన భగవద్గీతకు ""జ్ఞానేశ్వరి" అనే పేరుతో అతి విస్తరమయిన వ్యాఖ్యానాన్ని వ్రాసినారు అందులో కుండలనీ యోగ మహిమను, సాధన ప్రకారాన్ని కొంత వరకు ప్రవచించారు పిమ్మట కుండలినీ యోగాన్ని విరివిగా, ఆచరించి ప్రచారంచేసినవారిలో శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి, వేమన అగ్రేసరులు. బ్రహ్మంగారి భార్య గోవిందమ్మ, ఆయన పుత్రులు శిష్యులైన

సిద్దప్ప, కరణం గోవిందయ్య, హరిజనుడైన కక్కయ్య, స్వామి మనుమరాలు ఈశ్వరమ్మగారు మొదలైన వారు కుండలినీ యోగాచరణం వల్ల జీవసమాధి నిష్ఠనుపొంది సిద్ధిపొందిన వారే బ్రహ్మంగారి శిష్యపరంపరలోని తత్త్వ వాఙ్మయంలో కుండలినీ యోగపు అడుగు జాడలు మనకు లెస్సగా అగపడతాయి

ఆ బ్రహ్మంగారు నెలకొల్పిన కుండలినీయోగ సాంప్రదాయాన్ని పూర్తిగా ఎరిగినవారు అరుదుగానే వున్నారు నా బాల్యంలో మా తండ్రిగారు శ్రీకోటేశ్వరాచార్య గురుదేవులు కుండలీ యోగాభ్యాసపరులే అని వారిది పూర్ణంగా బ్రహ్మంగారి సంప్రదాయమే అని నేనెరిగిన సత్యం మానాన్నగారు బ్రహ్మంగారి శిష్యపరంపరకు చెందిన పరిమి వీరాచార్యులగారి శిష్యుడు ఆనాడు మా ఇంటికి ఎందరెందరో కుండలినీ యోగాభ్యాస పరులైన సాధువులు, బైరాగులు, సన్యాసులు, వస్తూపోతూ ఉండేవారు వారందరు మా నాన్నగారి చేత సత్కరింపబడి ఆయన కా యోగవిద్యను తాము నేర్చినంతవరకు నేర్పిపోతూ ఉండేవారు వారి సాంగత్యము వల్ల, మా పిత్రు పాదుల గురుత్వము వల్ల, శాస్త్ర పరనం వల్ల నే నీపాటిగా కుండలినీ యోగమార్గాన్ని తెలిసికొని ఆచరించుటమైనది ఆ పరిజ్ఞానంతోనే అమ్మ వంటి మహాత్ముల మీద ఆసక్తి, భక్తి గౌరవాలు; వారిని అర్థం చేసుకోవాలనే తహతహ పెరిగి, నా మార్గాన్ని విస్తరించుకోవటమైనది నేను అర్థము చేసుకొన్నంత వరకూ, యోగ విలాసమును గూర్చి ఈ గ్రంథములో వివరించ కలిగాను ఉత్తర యోగమార్గమనే నా గ్రంథంలో ఈ యోగ ప్రక్రియను గూర్చి ఇంకా విస్తరంగా వివరించుటమైనది యోగ ప్రియులు దాన్ని గూడా చదివి అమ్మను గూర్చి, అమ్మ వంటివారిని గూర్చి ఇతోధికంగా, విశేషాలను తెలిసికోవచ్చు.

శ్రీ కొండూరి వీర రాఘవాచార్యులు (ప్రజ్ఞానంద) కృతి
రాజుపాలెం అమ్మ బాలయోగిని చరిత్ర
సమాప్తం



రచన దేలినేని వెంకట్రామయ్య
(నెరులిపురి) పిడుగురాళ్ల మండలం

1 శుక్రవారంబున బుట్టె
శుక్రవారన, తపమునకు తారసిల్లె
శుక్రవారాన పుష్పవతిఅయ్యె
నాగశేషాంబ మహిమలనవకదంబ

2. తే॥ శరుణు వేడిన కోర్కెలున్ కరుణనిచ్చు
కల్ల కపటాలెరుంగని తల్లి యీమె
యిరువదేళ్లములు నిండినట్టి తపము
సీతకు । తగుతాత్పర్యమోమో ।

3 తె॥ అమ్మ ! యీ నాగశేషమ్మ యంగ తలము
పచ్చి బంగారమున కేన వచ్చియుండె
పోత బోసిన బంగారు బొమ్మ లాగ
మెరయు చుండును. కన్నులు మెరయునట్లు

4. సీ॥ పురుషమూర్తిని గన్న పాడపుర్వ గన్నట్లు
రుస రుసల్ చిత్తాన బెసగులాడు
బడి కేగతడుపైన పంతులమ్మ అర్వంగ
భయమేమి పడక నిబ్బరము తోడ
నా చిన్ని కృష్ణుని స్నానంబు చేయించి
తడివార్చుటకు వ్యవధానమయ్యె
అని తన చేంత నుండిన కృష్ణ విగ్రహమును
ముద్దు పెట్టుకొనును

5 ఆ॥వె॥ పంతులమ్మ నేర్పు పాఠాలుముగిసిన
పంతులయ్య బడికి పంపబోవ
పురుష బడికి నేను పోనంటె పోనని
చదువు మానె యోగసరళి చూసె

6. తె॥ కడచిబోయిన యాతులే కాశినాడు
దర్శనం బిచ్చె ప్రజలు ఉత్సాహమొసగి
నేల యీనిన చందాన నిండిపోయె
రాజుపాలెమ్ము గ్రామంబు బూజురాలే

## అమ్మవారి స్తోత్రం

రచన శ్రీమతి రావూరి మనోరమ, బి.కాం
హైదరాబాద్

కాషాయాంబరి శ్రీ శేషమాంబ
పత్యక్ష దైవం శ్రీ శేషమాంబ
ఆదిశక్తి శ్రీ శేషమాంబ
అనంత రూపిణి శ్రీ శేషమాంబ
శేష స్వరూపిణి శ్రీ శేషమాంబ
శివ స్వరూపిణి శ్రీ శేషమాంబ
ఆనంద నిలయి శ్రీ శేషమాంబ
మా ఇలవేల్పు శ్రీ శేషమాంబ
మహిమలు చూపే శ్రీ శేషమాంబ
రాజుపాలెం నిలయి శ్రీ శేషమాంబ
ధన్యజీవి శ్రీ శేషమాంబ
తేజ స్వరూపిణి శ్రీ శేషమాంబ

వరముల నొసగే శ్రీ శేషమాంబ
రాజరాజేశ్వరి శ్రీ శేషమాంబ
ఏకాంత నిలయి శ్రీ శేషమాంబ
భయములు తీర్చే శ్రీ శేషమాంబ
మంగళ రూపిణి శ్రీ శేషమాంబ
పిలచిన పలికే శ్రీ శేషమాంబ
అమర జీవి శ్రీ శేషమాంబ
నిర్మల హృదయి శ్రీ శేషమాంబ
ఆనంద దాయిని శ్రీ శేషమాంబ
త్రిశూల ధారిణి శ్రీ శేషమాంబ
చల్లని చూపుల శ్రీ శేషమాంబ
మోక్ష దాయిని శ్రీ శేషమాంబ
సూర్య ప్రకాశిని శ్రీ శేషమాంబ
పవిత్రమూర్తి శ్రీ శేషమాంబ
భగవత్స్వరూపిణి శ్రీ శేషమాంబ
బ్రహ్మతేజ శ్రీ శేషమాంబ
మహా యోగిని శ్రీ శేషమాంబ
శక్తి స్వరూపిణి శ్రీ శేషమాంబ
నిరాహారిణి శ్రీ శేషమాంబ
త్రిలోకజనని శ్రీ శేషమాంబ

లోకమాత నరుస్తే, నమస్తే. నమః

| నాయందు భక్తిగలవారు. జ్ఞానాన్ని, వైరాగ్యాన్నిపొందుతారు. జన్మ మృత్యు పరంపరనుండి ముక్తులవుతాడు - శ్రీరాముడు |
|---|

| ఎంతో తపస్సు చేసిన మీదట, పరమసత్యం ఇది అని నేను అర్ధంచేసి కొంటిని ప్రతిజీవి యందు భగవంతుడున్నాడు అంతకుమించి వేరు దైవంలేడు. ఎవరు జీవారాధకుడో అతడే నిజమైన దైవారాధకుడు - శ్రీ వివేకానందస్వామి |
|---|

ఓం శ్రీ నాగశేషమాంబ యై నమ:

# అమ్మవారి పాటలు

రచన : కీ॥శే॥ వెంకటస్వామి, గుంటూరు

ఆర్. మనోరమ బి కాం, హైదరాబాద్

ప॥ శరణ నిన్నే వేడితినే నాగశేషమాంబా తల్లీ

శరణ నిన్నే వేడితినే నాగశేషమాంబా తల్లీ

కొలిచెడి వారికి కొరత లేదని

చిరుదు వహించిన బీద మోగినివి ॥కొ॥

పరమ భక్తుల రేడా కనరాదే నీ జాడ

తలచి పిలచితిని తల్లీ పలుకవే

తలిచి పిలిచితిని తల్లీ పలుకవే ॥శ॥

మెత్తని వెన్న కన్నా.. నును వెచ్చని జాబిల్లి కన్నా

జాజిపూ గుత్తుల కన్నా మహా కోమల మమ్మా నీ హృదయము ॥శ॥

ప॥ అను దినమున నీ నామమునే .. నామమునే

మరువనే మాతృశ్రీ మాతా

మరువనే మాతృశ్రీ మాతా ॥అ॥

కరుణా మయి నా మొరవినమనినే

కరుణా మయి నా మొరవినమనినే

శరణు శరణంచు మొరవినమనినే

సూర్యశ్రీ మాతా ॥అ॥
వయస్సు ఇది ఏమి తపస్సు

నవ్వినదే
భాగ్యశాలివి నీవనుచు
భాగ్యశాలివి నీవనుచు ॥అ॥

\- శ్రీరాముడు

జాతికి చిన్ని ముత్యము
నున్నది మహా సత్యము
ద్యానించు చుంటిని
తల్లీ సత్యము ॥స్త్రీ॥
వయస్సు చిన్నది
మనన మున్నది
భక్తిలోనే ఇమిడ యున్నది
భక్తి గల అమృతము తాగే
భాగ్య శాలివై మహాతల్లి ॥స్త్రీ॥
అంద మైన నాగశేషుని
అండతో అభయమ్ము నిచ్చి
అమ్మ నాగశేష మాంబ
ఆలకించవె నా మొర ॥స్త్రీ॥
మరువనమ్మా నీదు స్మరణా
చూపవా నాపై నీ కరుణ
పరమ పావని పాప హరణి
ధన్యురాలవె ధరణి లోన ॥స్త్రీ॥

ప్రవాహము నుండి అలలు జనించునట్లు సంపద నుండి అసంఖ్యాకములైన చింతలు జనిస్తాయి అది మానవుని అలల వలె ఆశాంతునిగా చేస్తుంది దుష్కార్యాలకు ప్రేరేపిస్తుంది

- శ్రీరాముడు

## అమ్మవారు, భక్తురాలైన శ్రీమతి సరోజినికి చెప్పిన శ్లోకములు, పాటలు

### 1

పవిత్రానాం - సాధురూపాయ
జ్ఞానరూపాయ - విష్ణురూపాయ
హరహర రూపాయ - జ్ఞానేంద్రియాయ
కర్ణేంద్ర రూపాయ - మునీంద్రాది రూపాయ
అఖిలాండ కోటి - రూపాయ
బ్రహ్మాండ - రూపాయ
నారాయణ - రూపాయ
విష్ణు - రూపాయ
వేదవ్యాస - రూపాయ
నిఖిలమేలే - రూపాయ
కరుణామయి - రూపాయ
అనంతకోటి - రూపాయ
ఆశ్రిత నందన - రూపాయ
ముల్లోకాలు ఏలే - రూపాయ
కిలకిల నవ్వే - రూపాయ
ఈశ్వర - రూపాయ
ప్రమధ ఖండ - రూపాయ
జ్ఞానస్వరూపిణి - రూపాయ
పాహిమాం పాహిమాం పాహిమాం

మరువకే మాతృశ్రీ మాతా ॥అ॥

ఇది ఏమి వయస్సు ఇది ఏమి తపస్సు

ప్రకృతి పక్కున నవ్వినదే

పరమ భాగ్యశాలివి నీవనుచు

పరమ భాగ్యశాలివి నీవనుచు ॥అ॥

- శ్రీరాముడు

ప॥ స్త్రీ జాతికి చిన్ని ముత్యము

నాలో నున్నది మహా సత్యము

నిత్యమూ ధ్యానించు చుంటిని

నిజము తల్లీ సత్యము ॥స్త్రీ॥

వయస్సు చిన్నది

వరన మున్నది

భక్తిలోనే ఇమిడ యున్నది

భక్తి గల అమృతము తాగే

భాగ్య శాలివై మహాతల్లి ॥స్త్రీ॥

అంద మైన నాగశేషుని

అండతో అభయమ్ము నిచ్చి

అమ్మ నాగశేష మాంబ

ఆలకించవె నా మొర ॥స్త్రీ॥

మరువనమ్మా నీదు స్మరణా

చూపవా నాపై నీ కరుణ

పరమ పావని పాప హారణి

ధన్యురాలవె ధరణి లోన ॥స్త్రీ॥

ప్రవాహము నుండి అలలు జనించునట్లు సంపద నుండి అసంఖ్యాకములైన చింతలు జనిస్తాయి. అది మానవుని అలల వలె అశాంతునిగా చేస్తుంది దుష్కార్యాలకు ప్రేరేపిస్తుంది

- శ్రీరాముడు

## అమ్మవారు, భక్తురాలైన శ్రీమతి సరోజినికి చెప్పిన శ్లోకములు, పాటలు

**1**

పవిత్రానాం - సాధురూపాయ
జ్ఞానరూపాయ - విష్ణురూపాయ
హరహర రూపాయ - జ్ఞానేంద్రియాయ
కర్ణేంద్ర రూపాయ - మునీంద్రాది రూపాయ
అఖిలాండ కోటి - రూపాయ
బ్రహ్మాండ - రూపాయ
నారాయణ - రూపాయ
విష్ణు - రూపాయ
వేదవ్యాస - రూపాయ
నిఖిలమేలే - రూపాయ
కరుణామయి - రూపాయ
అనంతకోటి - రూపాయ
ఆశ్రిత నందన - రూపాయ
ముల్లోకాలు ఏలే - రూపాయ
కిలకిల నవ్వే - రూపాయ
ఈశ్వర - రూపాయ
ప్రమధ ఖండ - రూపాయ
జ్ఞానస్వరూపిణి - రూపాయ
పాహిమాం పాహిమాం పాహిమాం

రచన: శ్రీమతి పూండ్లసరోజిని

## 2

శంకర ప్రియాయ - ఓం నమో నారాయణాయ

దేవకీ పుత్రాయ - ఓం నమో నారాయణాయ

అంబరీషాయ - ఓం నమో నారాయణయ

శబరాయ - ఓం నమో నారాయణాయ

భారత మాతేయ - ఓం నమో నారాయణాయ

ముక్తి ప్రియాయ - ఓం నమో నారాయణాయ

ముక్తి కాంతాయ - ఓం నమో నారాయణాయ

వాసు దేవాయ - ఓం నమో నారాయణాయ

వైకుంఠ మాధవాయ - ఓం నమో నారాయాణయ

భక్తప్రియాయ - ఓం నమో నారాయాణాయ

ముకుంద ప్రియాయ - ఓం నమో నారాయాణాయ

జ్ఞాన స్వరూపిణి - ఓం నమో నారాయాణాయ

నాగేశేషమాంబ పాదపద్మములకు ఓం నమో నారాయణాయ

ఓం పరమేశ్వరి పాదపద్మములకు ఓం నమో నారాయణాయ

శ్రీమతి భద్రమ్మగారికి - ఓం నమో నారాయణాయ

## 3

అయ్యప్పస్వామి - అద్భుతస్వామి

జీవితమందున వెలిగేటి అయ్యప్ప స్వామి అద్భుతస్వామి

ప్రజలను కాపాడి రక్షించి దీవించినస్వామి

అరుణా చలమందు వెలిగేటి అద్భుతస్వామి

ప్రపంచమందు వెలిగేటి అద్భుతస్వామి ।

## 4

అంబపావనీ - నాగశేషమ్మ తల్లి

నీదరి చేర్చు కొనుము - తల్లి మాత

ఈభక్తుల పాలిట - కల్ప వృక్షము

ఓం జగజ్జననీ ఈశ్వరీ - కరుణింపుము తల్లి

## 5

యశోదతనయా - గోపాల

గోవర్ధనగిరి - గోపాల

నవనీతచోర - గోపాల

నందకుమార - గోపాల

ఆనంద కుమార - గోపాల

యశోదకుమార - గోపాల

గోవర్ధన గిరి ధర - గోపాల

నందకుమార - గోపాల

## 6

నాగబ్రహ్మం - నాగ బ్రహ్మం

ఓం కారాత్మక నాగ బ్రహ్మం

బ్రహ్మ విష్ణు మహేశ్వర బ్రహం

ఓం కారాత్మక నాగ బ్రహం

మహేశ్వర బ్రహం - మహేశ్వరబ్రహం

ఆత్మారామ బ్రహం

నాగబ్రహ్మం - నాగబ్రహ్మం

## రచన:  శ్రీమతి పూండ్లసరోజిని

### 7

ఎంత చక్కని శివగురు నామం ॥ఎంత చక్కని॥

ఎంత చక్కని గురుదేవ నామం

ఎంత చక్కని గురునామం ఎంత చక్కని గురునామం

ఎంత చక్కని పరమశివ ఘురునామం

ఎంత చక్కని బ్రహ్మా నంద రూపం

ఎంత చక్కని గురునామం

బ్రహ్మాండ మంతటు వెలిగేటి రూపం

### 8

శ్రీకల్పతరువే - లక్ష్మీ తులశమ్మ

సౌభాగ్యమే జయమ్మ - మమ్ము

కాపాడుము తల్లి - రక్షింపుము తల్లి

వేగరావమ్మ - ఓ జగ జననీ మాత

మము కాపాడుము తల్లి - దేవీ

కాత్యాయనీ - వరలక్ష్మీదేవి

మముపాలింపుము తల్లి

తులశమ్మ తల్లి వేగమే రావమ్మ

మము పాలించవా తల్లి ॥లక్ష్మి॥

కల్ప వృక్షము తల్లి - కాత్యాయనీ

జగజ్జననీ మము కాపాడుము తల్లి

రావమ్మ వరలక్ష్మీ తల్లి

మాయింటికి రావమ్మ

మాకు కటా క్షంబులు ఇవ్వుతల్లి

ఓ తులశమ్మ తల్లి నమ:

ఓం తులశమ్మ తల్లి నమ:

## 9

గురు చరణం - సద్ గురు నీగురు చరణం

గురు చరణం - భవభయ గురు చరణం

సద్ గురునీ - గురు చరణం

అకాల మృత్యువు గురు చరణం

గురుచరణం - గురు చరణం

వైకుంఠ మాధవ - గురు చరణం

శంకర గురు చరణం శివ గురు చరణం

కృష్ణా గోవిందా గురు చరణం

కైలాసవాస గురు చరణం

భవభయుగురు చరణం

నమో నారాయణ గురు చరణం

నమో నారాయణ గురు చరణం

మాధవాయ - ముకుందాయ గురు చరణం

గోవర్ధన గిరి ధారీ - గురు చరణం

కాళీమాత గురు చరణం

భవభయహర గురు చరణం

జ్ఞాన స్వరూపిణి గురు చరణం

అంబా దేవీ - నమో

అంబా నమో దేవి

**రచన: శ్రీమతి పూండ్లసరోజిని**

## 10

అయంతు ఆయంతు నా యందే పరమాత్మ

నా యందే పరమాత్మ పలుమారు పలికేవు

గురుడు గురుడు అని మనసార పలికేవు

పరమాత్మ - పరమాత్మ అని ప్రతిసారి పలికేవు

నా యందే పరమాత్మ లీనమై యండు

పరమాత్మ లీలలు కనుగొనండి

ఆపరమాత్మను చేరండి గురు సేవలు చేయండి

నా పాలు పొంగించండి ॥ఆ॥

పరమాత్మ - పరమాత్మ అని పలుమారు పలికేవు

పలుసార్లు పలికేవు మము దీవించండి ॥ఆ॥

## 11

మేలుకో మేలుకో సతీ గురుస్వామి
తెల తెల వారె - జాము జాము ప్రొద్దు ఎక్కె
మేలుకోవా నాతండ్రి ॥మేలుకోరా నా తండ్రి
మేలు కుంటే నీవు ముక్తిని పొందెదవు
జయ జయ పాహిమాం నమో। నమో।
జయ జయ సద్గురు స్వామి నమో। నమో।
జయ జయ గోవిందా నమో నమో ।
జయ జయ ఈశ్వరీ మాత నమో నమో ।
నమో । పాహిమాం । నమో పాహిమాం
నమో । పాహిమాం । పాహి । పాహి । పాహిమాం ।

## 13

నమో నమో । శ్రీ రామ
నమో నమో । రఘురామ
నమో నమో । జానకి రామా
నమో నమో । శ్రీ హనుమాన్
నమో నమో । జై హనుమాన్
నమో నమో । నమామి :
నమస్తె నమస్తె - నమ·
వేగమే రావయ్య ముద్దుల కృష్ణా
రావయ్య చిన్ని కృష్ణా
పరుగెత్తి రావయ్య గోపికా లోలుడవు
మురళీ కృష్ణా - మము బ్రోవవయ్యా

## భక్త మహాశయులకు ఒక విజ్ఞప్తి!

గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలుకా యందు గల రాజుపాలెం అను గ్రామములో విశ్వకర్మకులజులు ఆభోనస గోత్రీయులు యద్దనపూడి కోటయాచారి భద్రమ్మ యను పుణ్యదంపతులకు వారి పూర్వ జన్మ సుకృతము వలన యీ నాగశేషమాంబ జన్మించెను. యీమె చరిత్ర కళా ప్రపూర్ణ కీ॥శే॥ కొండూరి వీర రాఘవాచార్యులు చాలా చక్కగా సాంగోపాంగముగా రచించిరి. యిక నేను చెప్పనక్కరలేదు. యీమె నిరాహార దీక్షణి దివ్యతపస్విని. పరమేశ్వరీ యవతారిణీ మాతృమూర్తి జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేలా అన్నట్లు యీ తపశ్వీని గురించి వ్రాయపనిలేదు. యిట్టి బాల యోగిని నాగశేషమాంబ గారి మాఘ పౌర్ణమి 4.2.96 వార్షికోత్సవ సందర్భమున మాచర్ల వాస్తవ్యులు భద్రదత్త గ్యోత్రోర్భవులు చిత్రకవితాలంకార, బిరుదాంకితులు సహజకలి । పోకూరి సుబ్బయా చార్యులు భక్తి ప్రపత్తులతో సమర్పించు కున్న - పద్య రత్నములు.

ఉ॥ పంచమ వర్షమందునె ప్రపంచ సుఖంబుల కాశజెందకన్
సంచిత కర్మ శేషమని స్వాంతము నందున చింత జేయుచున్
చంచల మందనీక మది శర్వుని నామము నుచ్చరింపుచున్
ద్యంచితి వమ్మ దుర్గుణపు తీగల నెల్ల జయించి యోగినీ

ఉ॥ అమ్మరో కందిమల్లయ పురంబున నుండిన భక్తకోటికిన్
మిమ్ముల జూడవచ్చుటకు మిక్కిలి భారమటంచునెంచి, నీ
విమ్మహి రాజుపాలెమున యీశ్వరి, యద్దనపూడి వంశ, ర
త్నమ్మన బుట్టి, భక్తుల నుదారత జూపితె బాలయోగినీ

చ॥ పురహరు గూర్చి మున్ను శివపూజలొనర్చు డెరుంగకేదొ యా
చరణలో సూక్ష్మమైన యపచార మొనర్చిన తత్ఫలంబునన్
ధరను జనించి భర్గుని సదా భజియించి తపంబొనర్చు, నీ
దరిశనమైన, పుణ్యలకు దక్కదె మోక్షము బాల యోగినీ

ఉ॥ అన్నము, నీరు మాని ప్రజలందరు జూడగ నెల్లవేళలన్
కన్నులు మూసి నోట బలుకన్ పనిలేకను యోగనిష్టచే
నిన్నెపు డింక జూతు శివనేనని యంచు తపంబొనర్చు, నీ
పున్నెము నెన్న శక్యమటె పొల్పుగ బ్రహ్మకునైన యోగినీ

ఉ॥ కమ్మని భక్ష్యభోజ్యములు కాంచన చేల సుగంధ జాలముల్
అమ్మరో హేమ రత్న మణిహార దురాశల ద్రోసిపుచ్చియున్
నెమ్మది యారు వర్గముల నేర్పున ధ్వంస మొనర్చి యీశ్వరున్
నమ్మి స్మరించు మేటి సుగుణంబులు గల్గిన బాలయోగినీ

ఉ॥ ఇమ్మహి విశ్వకర్మకు లెందరో మౌనుల ధర్మమార్గముల్
నమ్మక యిచ్చవచ్చినటు, న్యాయ విరుద్ధము లాచరింపగా
అమ్మరో విశ్వకర్మకులమంత పవిత్ర మొనర్పనెంచి నీ
విమ్మహి, రాజుపాలెమున యీశ్వరిపై కులశంక దీర్చితే

ఉ॥ అంగనయొర్తు మాతనపహాస్యము జేయగనెంచి, పెంకులో
యింగలమున్ రగిల్చి బహుయార్ఘ్యతో వేసియు మెర్వకాయలన్
ముంగల బెట్టి ధూపమని, మ్రొక్కగ నామెయు వీధినందరున్
చెంగున గంతు లేయుచును చీదుచు, తుమ్ముచు, దగ్గులాగకన్
భంగము జెందినార లోక బాధ మరేమియు లేదు తల్లికిన్

ఉ॥ శ్రీ భ్రమరాంబనాధుడు, ప్రసిద్ధ గుణాఢ్యుడు, మల్లికార్జునుం
డభ్రమనోజ్ఞకేశుడు మహామహితాత్ముడు నాది దేవుడా
శుభ్రతనూ విలాసుడు, యశో పరిపూర్ణుడు, దేవ దేవుడే
మీ భ్రమలన్ని దీర్చియు నమేయ సుఖంబుల నిచ్చి బ్రోచుతన్

ఇట్లు

**చిత్ర కవితాలంకార,**

**సహజకవి, పోకూరు సుబ్బయాచార్యులు**

**మాచర్ల**

## గాయత్రి మంత్రము

ఓం భూర్భువ: స్వ: తత్సవితుర్వరేణ్యమ్
భర్గోదేవస్య ధీమహి ధియో యోన ప్రచోదయాత్ ॥

ఓ పరమేశ్వరా! త్రిజగద్రక్షకా! విశ్వకర్మాత్మకుడయిన సవితృదేవుని బ్రహ్మాతేజమును మేము ధ్యానించుచున్నాము ఆ పరంజ్యోతి మా బుద్ధులను (సత్కర్మాచరణము నందు) ప్రేరేపించుగాక.

## విశ్వకర్మ భగవానుని స్తుతి

శ్లో॥ విశ్వోద్గతి స్థితిలయాద్యఖిల క్రియాణామ్
హేతుత్వమేత్య శ్రూతిభి: పరిగీయతే య:
శ్రీ విశ్వకర్మ సముదంచిత సార్థనామ్నా
తం, దేవదేవ మజ మాద్య మనంత మీడే

**ప్రత్నానంద స్వామి**

# పంచ రత్నాలు

రచన యస్ భద్రాచలం, సత్తెనపల్లి

(1)

జయహో! జయహో!
జయహో! జయహో!
చిత్కళామ తల్లికి జయహో!
నాగశేషమాంబకు జయహో!

పావన మయ్యిన మన్యభూమిలో
పుణ్యచరితుల బ్రోచితివమ్మా
ఆదిశక్తివై అలంకరించి
అవని జనులను బ్రోచితివమ్మా ॥జయ॥

ఆదియు మధ్యము అంతములెరిగి
ఆనందామృత తత్వముతోడ
జగజ్జననివై జగదీశ్వరవై
జగముల పాలించు జయజననీ ॥జయ॥

(2)

దయరాదేలా మాపై జననీ
జాలి లేదా లేదేలా మాపై జననీ
శేషమాంబా జననీ ॥దయ॥

కరుణతో మమ్ముల కావగరావా
దీనులమమ్మా దయగనవమ్మా
నీ పదములనే నెరనమ్మితినీ
రావేలా జాలి కలుగ దేలా ॥దయ॥

నీనామమునే నిరతము జపించయింప
భక్త కోటుల భయములు తీరె
పావనమయ్యే మా జన్మములు
మొరలాలించి పరిపాలింపవమ్మా ॥దయ॥

(3)

నీ చల్లని చూపుల వెన్నెలతో
మా ఇల్లము జల్లను సమయములో
నీ దర్శన భాగ్యము ఎన్నటికో
మా జన్మల సఫలత ఎప్పటికో ॥నీ॥

మహిలో మేము పొడమి నందులకు
మాతృ సేవలో మసలినందులకు
కలలోనైనా ఇలలోనైనా
నీ దర్శన భాగ్యము ఎన్నటికో
మా జన్మల సఫలత ఎప్పటికో ॥నీ॥

పుణ్య భూమిలో వెలసితివమ్మా
మన్య భూమిలో మసలితివమ్మా
నిర్మల హృదయము నిలిపితివమ్మా
నీ దర్శన భాగ్యము ఎన్నటికో
మాజన్మల సఫలత ఎప్పటికో ॥నీ॥

(4)

జీవాత్మ నీవేకదా
మాతా పరమాత్మ నీవేకదా ॥జీవాత్మ॥

సదయు మాసై నిత్యము నెరపి
నీ పద సేవయే నిరతము చేసి
మా హృదయములో మా వేదనలో
మాతృమూర్తివై మము బ్రోవుమా ॥జీవాత్మ॥

మాయామయమౌ మహిలో మేము
మమకారములను విడలేమైతిమి
నీ సన్నిధిలో, నీ ధ్యానములో
నీ పదదాసుల నిలుపుము మాతా ॥జీవాత్మ॥

(5)
రారండి, రారండి రాజుపాలెము
రక్తి మీర, భక్తులారా ఓ మహా సుజనులారా ॥రారండి॥

మాతృమూర్తి దర్శనమ్మే మహాభాగ్యము
కరుణ మూర్తి గమ్యమ్మే జన్మపావనం
కదలిరండి వేగమే, కనుగొనండి యోగమే
సమయమిదే, వేగరండి · తరుణమిదే కదలిరండి ॥రారండి॥

అందు ఇందు సందు లేక అమ్మ యున్నది
అండ పిండ బ్రహ్మాండము నిండి యున్నది
శరణు వేడ వేగమే కరుణ జూపు మార్గమే
కదలిరండి కనుగొనండి సమయమిదే రారండి ॥రారండి॥

రచన· కాకబత్తి పిచ్చమ్మ, బృగుబండ

సాధించ వలెను - చక్కని గురుభోధ-సాధించవలెను తల్లి

సాధించిన వారికి స్వర్గమున్నదిగా ॥సా॥

సాధించవలెను । చక్కని గురుభోద

మిక్కిలి ఆయాసపడవద్దు మీరు - దక్కించు

కున్నవారు దరిచేరుతారు.

కాండ కాండలనడుమ తపసులు చేసిన

వారంతా ధన్యులౌతారు

ఏమో చేసితిమని - ఎగరవద్దుమీరు

ఎగిరిన వారంతావ్యర్థులౌతారు ॥సా॥

గంగిరెడ్డి పాఠో । పురమందు వెలసిన

ఎందరెందరో భక్తులు వస్తారు తల్లి

సాధించవలెను - చక్కని గురుభోధే ॥

# దాతలు

| | | |
|---|---|---|
| 1 | శ్రీ రావూరి సుదర్శనరావు<br>APST Corporation, Hyderabad | 1116-00 |
| 2 | శ్రీ పొన్నపల్లి సుబ్రహ్మణ్యం<br>HAL, Hyderabad | 1116-00 |
| 3 | శ్రీ పూండ్ల భాను ప్రసాదరావు<br>రిటైర్డు తహశీల్దారీ, హైదరాబాద్ | 1116-00 |
| 4 | శ్రీ పొన్నపల్లి సుబాస్‌బాబు<br>ఎలక్ట్రికల్ సూపర్ వైజరు, రైల్ నిలయం - సికిందరాబాద్ | 501-00 |
| 5 | శ్రీ రావూరి విజయ కుమార్<br>ఆర్టిస్ట్, హైదరాబాదు | 508-00 |
| 6 | శ్రీమతి శనగపాటి నాగేశ్వరమ్మ గారు<br>W/o. లేటు చక్రధరరావు, బండలమెట్ట, వినుకొండ తాలూక | 508-00 |
| 7 | శ్రీ పూండ్ల వెంకటేశ్వరబాబు<br>HCL, హైదరాబాదు | 320-00 |
| 8 | శ్రీ పూండ్ల రామకృష్ణ B.Com<br>N.S.L. హైదరాబాదు | 1116-00 |
| 9 | శ్రీ పూండ్ల శంకర్<br>హైదరాబాదు | 250-00 |
| 10 | శ్రీ పి రఘుపతి<br>PRADEEP CHIT FUND, HYDERABAD. | 201-00 |
| 11. | శ్రీ పూండ్ల సుభాషిణి, DECE<br>B.D.L., HYDERABAD. | 116-00 |
| 12 | శ్రీరాం రఘుకుమార్, M.S.C<br>HYDERABAD. | 116-00 |
| 13 | వి. మురళీ, హైదరాబాద్ | 116-00 |
| 14 | గూడవల్లి రమేశ్, హైదరాబాద్ | 116-00 |
| 15. | పి. నరేంద్రబాబు, అద్దంకి | 201-00 |



శ్రీ పొన్నపల్లి సుబ్రహ్మణ్యం, లలిత కుమారి (హైదరాబాదు)



శ్రీ రావూరి సుదర్శన రావు, మనోరమ (హైదరాబాదు)



శ్రీ పూండ్ల రామకృష్ణ, రాధారాణి (హైదారాబాదు)



శ్రీ పొన్నపల్లి సుభాష్ బాబు, (హైదరాబాద్)



శ్రీ శరగపాటి హరివీర బ్రహ్మేగుండం, పద్మ, (విజయవాడ)



శ్రీ ఎ యాగంటి (మెడికొండూరు)